శివానుభవ గ్రంథమాల: ఏకాదశ బిల్వము

# వీరశైవ మహిళా శివశరణులు

రేకళిగె మఠము వీరయ్య
(ఉందాబజారు, హైదరాబాదు-ఆం ప్ర.)



ప్రకాశకులు :

శివానుభవ సమితి, హైదరాబాదు

4-7-947, ఇసామియాబజారు, హైదరాబాదు-500027 (ఆం.ప్ర.)

1980

రచయిత

రేకళిగె మఠము వీరయ్య

(ఉందాబజారు, హైదరాబాదు-ఆం ప్ర)




ప్రకాశకులు :

శివానుభవ సమితి, హైదరాబాదు

4-7-947, ఇసామియాబజారు, హైదరాబాదు-500027 (ఆం.ప్ర.)

1980

ప్రథమ ముద్రణము : 1980

ప్రతులు : 1,000



మూల్యము :

సభ్యులకు రూ॥ 2-75

ఇతరులకు రూ॥ 3-00



ముద్రణ

జయశ్రీ ప్రింటింగ్ అండ్ బుక్‌బైండింగ్ వర్క్స్
విద్యానగర్, హైదరాబాదు-500 044.

బసవప్రియ

కుంకుమశోభిత, లింగైక్య

మజ్జనని

మాతృ శ్రీ సిద్ధమ్మ పాదములకు

నా డెబ్బది రెండవ జన్మదిన సుమముగా

ఈ కృతిని

సమర్పించు చున్నాను.

# విషయసూచిక

శివాయనమః

# ప్రశంస

శివశరణుల వచనముల అనువాదములను, వారి జీవితచరిత్రలను ప్రచురించుట శివానుభవసమితి ముఖ్యోద్దేశములలో నొకటి. మిత్రులు, ఆత్మీయులునగు శివ శ్రీ రే. మ. వీరయ్యగారు సమితి యుద్దేశములను పురస్కరించుకొని, కొందరు శిశరణురాంధ్ర జీవిత చరిత్రలను వారి కొన్ని కొన్ని వచనముల అనువాదములను సమకూర్చి 'వీరశైవ మహిళా శివశరణులు' అనుపేరుతో ఈ పుస్తకమును రచించి, తమడెబ్బదిరెండవ జన్మదిన స్మారకముగా తమతల్లి మాతృశ్రీ కుంకుమశోభిత లింగైక్య సిద్ధమ్మగారి పాదములకు భక్తితో సమర్పించుట ముదావహము.

ఈ పుస్తకమును శివానుభవ గ్రంథమాలయందు పదునొకండవ బిల్వముగా ప్రకటించునట్లు కోరుచు, ముద్రణవ్యయముల గురించి, రూ॥ 1,111-00 విరాళమునొసగుటయు మిక్కిలి శ్లాఘనీయము, అనుకరణీయము. సమాజాభిమానులు, సాహిత్యప్రియులు ఈ పుస్తకమును ఆదరించి ప్రోత్సహింతురని విశ్వసించుచున్నాము.

సమితి నిబంధనల ప్రకారము సాహిత్యాభిమానులు సమితియందు శాశ్వత సభ్యులుగాచేరి సమితి ఉద్దేశసాధనయందుతోడు పడుచుండుట సంతోషకరముగా నున్నది. గత ప్రచురణ "ఇష్టలింగ విజ్ఞానము" అనంతరము సమితియందు ఇంతవరకు చేరిన సభ్యుల పేరులను ఈ పుస్తకము చివర వ్రాయబడినది. ఇతర ధార్మిక సాహిత్యాభిమానులుకూడ సమితియందు సభ్యులుగాచేరి తోడు పడుదురని విశ్వసించు చున్నాను.

ఇసామియాబజారు
హైద్రాబాదు-500027
తేది. 19-4-1980

ఇట్లు
రవికోటి మఠంవీరభద్రయ్య
సంచాలకులు

నిడదవోలు శివసుందరేశ్వరరావు
ఎం. ఎ. బి. ఒ. ఎల్.
పరిశోధన పండితులు

లక్ష్మీకాంత నిలయము
2-2-1137/
న్యూనల్లకుంట
హైదరాబాదు-44
30-1-80

## మహిళా శివశరణులకు

# స్వాగతము

శివశ్రీ రేకళిగె మఠం వీరయ్యగారు శివానుభావుల యందు భక్తి శివానుభావ సాహిత్య ప్రచారమునందాసక్తి కలవారు. హైదరాబాదు లోని "శివానుభవ సమితి" యందు చిరకాలము సభ్యులుగా నుండి వీరశైవ సాహిత్యాభివృద్ధి గురించి వీరు సాగించుచున్న నిరంతర కృషి ప్రశంసనీయము. సమితి పేర వెలువడిన గ్రంథములలో వీరి అనువాద రచనలే అధికముగా గలవు.

వీరి ప్రథమకృతి 'బసవ వచనామృతము'. ఇది ఇప్పటికి నలుబది సంవత్సరముల క్రితమే వెలువడినది. భక్తిభండారి బసవేశ్వరుని కన్నడ వచనములలో నూటయెనిమిదింటిని శ్రీ వీరయ్యగారు అనువదించి తెలుగుదేశమున కల్యాణ బసవేశ్వరుని వచనామృతమును పంచి పెట్టినారు.

కాశీ యందలి విశ్వారాధ్య జగద్గురు పీఠాధిపతులై యుండిన శివశ్రీ చిదిరెమఠం వీరభద్రశర్మగారు శ్రీ వీరయ్యగారు అనువదించి ప్రచురించిన బసవ వచనామృతమునకు 'కించిత్త'నియెడు శీర్షికతో మున్నుడి వ్రాసియున్నారు. శ్రీ శర్మగారి సహచర్యములో శ్రీ వీరయ్య గారి తెలుగు వచన రచనా పాటవము మెరుగెక్కినది,

వీరశైవ వాఙ్మయమును గూర్చి పరిశ్రమించిన పండితులలో చాలమందికి కన్నడభాషతోగాని, శివశరణసాహిత్యముతోగాని అంతగా పరిచయ మున్నట్లు కన్పించదు. పండితారాధ్య, పాల్కురికి సోమన, యధావాక్కుల అన్నమయ్య. పిడుపర్తి బసవన్న సోమనాథా దుల, గ్రంథములు తెలుగున ప్రధానముగా వీరశైవధర్మప్రబోధక ములు. ఈ గ్రంథముల యందు శివశరణులను గూర్చి విస్తారముగా లేదు. శ్రీ వీరయ్యగారు విశాలమైన కన్నడ శివశరణ సాహిత్యముతో అనుబంధ మున్న వారగుటచే వారు కొన్ని గ్రంథములను వెలుగునకు తేగలిగిరి.

శివశరణులలో మహిళాశివశరణుల భక్తి విలాసములను శ్రీ వీరయ్యగారు చక్కగా చిత్రించినారు. తమ డెబ్బది రెండవ జన్మదిన సందర్భముగా నీ "వీరశైవమహిళా శివశరణు"లను గ్రంథమును శ్రీ వీరయ్యగారు తమ మాతృమూర్తిస్మృత్యంకముగా వెలువరించి ధన్యజీవు లయినారు. వయోవృద్ధులయ్యును అనేక ఇక్కట్టులను ధైర్యముతో నెదుర్కొనుచు వీరశైవ సాహిత్యాభివృద్ధి కొరకు వీరు పడు శ్రమ అద్భు తాశ్చర్య సంజనితములుగా నున్నవి. ముఖ్యముగా తెలుగుసోదరులకు కన్నడ వీరశైవ సాహిత్య పరిచయము కావించుట యందు వీరు చేయుచున్న కృషి బహుధా ప్రశంసనీయము. వీరికిగల ధార్మిక నిష్ఠ, సంస్కార ప్రభావము వలననే వీరిట్టి కష్టసాధ్యములగు పనులు సుసాధ్య ములుగా చేయగలుగుచున్నారు, శివశ్రీ వీరయ్యగారి సహజ సరళ స్నేహ సౌహార్ద్రములే మా మిత్రత్వమునకు పునాది, వారితో ప్రథమ పరిచయమే మహదానందమును కలిగించినది.

ఆదర్శప్రాయములయిన నీ శివశరణుకాంద్రను తెలుగు తల్లులు పసుపు కుంకుమలతో పలకరింతురుగాక.

యన్. యస్. సుందరేశ్వరరావు

**Dr. B. RAMA RAJU**
Professor & Head
DEPARTMENT OF TELUGU

UniVersity College of Arts & Commer
Osmania University
Hyderabad-500007

శివశ్రీ రేకళిగె మఠము వీరయ్యగారు రచించిన "వీరశై
మహిళా శివ శరణు"లను పుస్తకము చదివినాను. ఈ మహా భక్తురాం
అందరును కైలాసము నుండి దిగివచ్చిన దివ్యజీవులు. ఒకరిని మించి
వారు మరొకరు. వారి పవిత్ర జీవిత చరిత్రలు వారి దివ్యానుభ
వచనములు చదివినపుడు ఒడలు జలదరించును. ఇంత మహోత్కృష్టమై
ఆదర్శ జీవితములు గడిపిన ఆ తల్లుల సంతానమేనా మనము? ఏమో
వారికి మనకు ఎంత యంతరము? ఎంత యఖాతము? ఈనాడు మ
దేశము మన మతములు ఇట్లెందుకైనవి? ఆ పుణ్యాత్ములు చెప్పి
దానిలో చేసిన దానిలో సహస్రాంశము పాటించినను మనము ధన్యు
మగుదుము. కనుక నిట్టి పవిత్ర జీవిత చరిత్రములు పిల్లలకు పెద్దల
అవశ్య పఠనీయములు

శ్రీ వీరయ్యగారి శైలి సులభ సుందరము, భక్తి భావ బంధు
రము. అన్ని మతముల వారికి అన్ని కాలముల వారికి అన్ని దేశము
వారికి ఈ చిన్ని పొత్తముపాదేయము. దీనిని మాధ్యమిక తరగతు
విద్యార్థులకు పాఠ్యము చేసిన భావితరములవారైనను సచ్ఛీలు రగుదుర
కన్నడములో నున్న ఇట్టి అమూల్య శరణ సాహిత్యమును వీరయ్యగా
తెలుగు ప్రజలకు ఇతోధికముగా నందింతురుగాక. వారొనర్చిన
సేవకు తెలుగువారు కృతజ్ఞులు.

బి. రామరా

కళా ప్రపూర్ణ
డా॥ దివాకర్ల వేంకటావధాని.
ఎం ఎ. [ఆనర్సు] పి. హెచ్. డి.

బరకత్‌పూరా
హైద్రాబాదు
5-5-80

శ్రీ

శ్రీయుతులు రేకళిగె మఠము వీరయ్యగారు రచించిన వీరశైవ మహిళా శివ శరణులు అను గ్రంథమును బఠించి యానందించితిని. వీరిలో అక్కమహాదేవి, బెజ్జమహాదేవి, నీలాంబిక అనువారి చరిత్రలు సర్వజన విదితములు, మిగిలినవారు కూడ మహాభక్తురాండ్రయినను వారి చరిత్రలు పలువురికి తెలియవు. శ్రీ వీరయ్యగారనేక గ్రంథములు పరిశీలించి శివశరణులైన మహిళామణుల చరిత్రలను సర్వసుబోధము, సులలితము నైన శైలిలో రచించి ఆంధ్రులకు మహోపకారము నొనరించినారు. పాల్కురికి సోమనాథుడు మున్నగు మహాకవుల రచనల నుండి వారు ముఖ్యములైన భాగముల నుద్ధరించి గ్రంథమునకు మరింత వన్నె కలిగించినారు. ఈ మహిళామణులు ప్రదర్శించిన భక్తి యెంత పవిత్రమైనదో అంత ఆదర్శప్రాయమైనది. "గుణాః పూజాస్థాన గుణిష్వే నచ లింగం నచ వయః" అను సూక్తి యీ మహిళామణుల యెడ సార్థక మగుచున్నది. ఆంధ్రు లీ గ్రంథమును శ్రద్ధతో చదివి నిర్మలమైన భక్తి నలవరించుకొందురనియు, గ్రంథకర్తగారిట్టి గ్రంథముల నింకను రచించి ఆంధ్ర భాషా యోష కభినవాలంకృతులు చేకూర్తురనియు నాశించుచున్నాను.

—దివాకర్ల వేంకటావధాని

# మరో చూపు

చిత్త శుద్ధితో శివ పారమ్యమే అభిలషించి వర్తించిన శైవుల గుణ శీల విశేషాలు భారతీయ చరిత్రను పవిత్రం చేశాయి. కొన్ని దృక్పథ భేదాలవల్ల శైవ శాఖలు వివిధాలుగా వికసిల్లినా పట్టు విడువని శివ పారమ్య దీక్ష శైవుల గుణాతిశయం.

మొదటిమాటగా చెప్పవలసి వస్తే భారతీయుల ప్రప్రథమ ఆముష్మిక మార్గం శైవ మార్గమే. చారిత్రక కారణాలవల్ల మత భేదాలు ఏర్పడిన సంగతి విజ్ఞులకు విదితమే. చివరకు బసవేశ్వరుడు పునరుద్ధరించిన శైవ సంఘం భారతీయ ప్రజల నంతా ఒకే ఒక ధార్మిక సూత్రంపై నడిపించడానికీ, సామాజికంగా విడిపోయిన వివిధ వర్గాలన్నింటినీ ఏకం చేయడానికీ ఉద్దేశించిన సంగతి విజ్ఞులకు విదితమే.

బసవేశ్వరుడూ, ఆ మహామహుని అనుయాయులూ బోధించిన వీరశైవం తీరుతెన్నులు స్థూలంగా రెండు భాగాలుగా తోచింది నాకు: (1) నామకః ఉన్నతం అనిపించుకున్న వర్గంలో పుట్టి పెరిగిన వ్యక్తులు ఉన్నతులు కారు. శైవజ్ఞాన సంస్కారులు మాత్రమే ఉన్నతులు అన్నారు. ఇదొక భాగం. (2) జ్ఞాన సంస్కారాలతో నిమిత్తం లేకుండా మాయ బోధలు చేస్తూ ప్రజలను మోసగించే ధర్మవంచకుల కుచేష్టలన్నీ ప్రజలకు అర్థమయ్యే భాషలో చెప్పి ఆ ధర్మవంచకుల కపటాలు రచ్చకీడ్చారు. ఇది రెండో భాగం. పై రెండు పద్ధతులలో శైవాచార్యులు గతయుగాలలో ప్రజలను బాగా జాగృతులను చేశారు. ఇంతైనా మాయ మతాలు తమ కుచేష్టల గారడీలు మానలేదు. అమాయకులైన

ప్రజలు ఆ గారడీ తమాషాలకు లోనుగాక తప్పలేదు. ఇదంతా బూటకపు బోధకుల అవకాశ వాదమని చరిత్ర ఘోషిస్తూనే ఉంది. మాయ మతాలపై తిరుగుబాటు ధ్వజమెత్తే శివభక్తులు ప్రతియుగంలోనూ అవతరిస్తూనే ఉన్నారు.

శ్రీ రేకళిగె మఠం వీరయ్యగారు రచించిన "వీర శైవ మహిళా శివ శరణులు" అనే ఈ గ్రంథం శివ పారమ్యమైన బోధకూ, జ్ఞాన ప్రచారానికి శ్రేష్ఠతరమైన రచన. శివపరమైన ధార్మికోద్యమంలో మహిళామణులు నిర్వహించిన పాత్ర మహోన్నతమైందని నిరూపించిన గ్రంథకర్త ప్రయత్నం ప్రశంసనీయమైంది. మనదేశంలో పురుషులు నానా పోకడలకు గురిఅవుతున్నా మన సనాతనధర్మాన్ని ఆచరణలో ఉంచిన కీర్తి మహిళామణులకే బాగా దక్కింది. మహిళల పట్టుదలలు కారణంగానే మన భారతీయ ధర్మం ఇంకా పవిత్రంగా నిలువ గలుగుతున్నది. ఈ వాస్తవం గ్రహించిన రచయిత మహిళల ప్రాధాన్యం చూపడానికే అనండి ఈ గ్రంథం రచించారు. ఇది విశిష్టమైన పద్ధతి. రచయిత శైలి సరళ సుందరమైంది. సహజమైన శివభక్తిగల శ్రీ వీరయ్యగారి గ్రంథం చదివి మనమంతా (అనుభవజ్ఞాన) మార్గంలో పడదాం.

హైదరాబాద్
5-5-1980

డా॥ ముకురాల రామారెడ్డి
డిప్యూటీ డైరెక్టర్ తెలుగు అకాడమీ

ఆస్థాన విద్వాన్
యం. జి. నంజుండారాధ్యులు
ప్రొ. (రిటైర్డ్) వీరశైవ ఫిలాసఫీ.
మైసూరు యునివర్సిటీ.

బసవేశ్వరరోడు
మైసూరు-
17-5-1980

శివశ్రీ రేకళిగె మఠం వీరయ్య గారి
సుముఖమునకు, శరణులు.

మీరు పంపిన "వీరశైవ మహిళా శివశరణులు" అను గ్రంథము చేరినది. సాంగముగ చదివినాను. అక్కమహాదేవి, సుగ్గలాదేవి, దుగ్గళ దేవి, నీలాంబిక, గంగాంబిక కాళవ్వ మరి॥ లింగమ్మ మొదలగువారి సంక్షిప్త పరిచయము, వారి వారి వచనములకు మీరు చేసిన సరళానువాదము చాలా ఆకర్షణీయముగా నున్నది. ఆంధ్ర ప్రదేశమందు వీరశైవ సాహిత్య ప్రచారము సద్యః మీ యొక్క శివానుభవ సమితి నుండి ఆసక్తితో నడుచుచుండుట హ్లాదావహము. మీ యొక్క ధర్మాభిమానము భాషాభిమానము అనుకరణీయము. సమితియొక్క కార్యప్రణాళిక యశస్వియగు గాక.

యం. జి. నంజుండారాధ్యులు

శ్రీ

"వీరశైవ మహిళాశివశరణుల" రచయిత శ్రీరేకళిగె మఠంవీరయ్య గారు మా కాళాశాల (డా॥ అంబేడ్కర్ కాలేజీ) యందు ప్రారంభము నుండి అకౌంటెంటుగా పనిచేయుచున్నారు. వారు నాకు సుపరిచితులు. మితభాషణులు, వినయము ధార్మికము మూర్తీభవించిన మనీషి. మీదు మిక్కిలి తెలుగు, కన్నడ సాహిత్యమునందు ప్రవేశముకలవారు. మా కళాశాల పత్రిక (1978-79) యందు వారు ప్రకటించిన "వర్ణవ్యవస్థ" యను వ్యాసమును చదివి వారు తెలుగునందు సుబోధకముగా వ్రాయగలరని గ్రహించితిని. భారతి మాసపత్రికయందు వారువ్రాయు వ్యాసములు చదివి వారిని అభినందించితిని. వారు వ్రాయు విషయము ముఖ్యముగా శైవ సాహిత్యమునకు సంబంధించినది. వారీపుస్తకమును నా అభిప్రాయార్థము నొసగియున్నారు.

తెలుగులో మహాభక్తవిజయము మొదలగు గ్రంథములు కలవు. వానియందు స్త్రీ, పురుష భక్తాగ్రగణ్యుల చరిత్రలు వ్రాయబడినవి, శివశరణుల చరిత్రలు వ్రాయబడలేదు. ఈ రచయిత కన్నడభాషయందున్న శివశరణుల చరిత్రలను బాగుగా నెరిగినవారు. అందువలన మహిళా శివశరణుల చరిత్రలనే గ్రహించి పుస్తకమును రచించి తమ మాతృమూర్తికి అంకితమీయ వలెనను తలంపులో, వారు దానిని సరళసుందరమైన శైలిలో తీర్చిదిద్దిరి. దీనివలన వారికున్న మాతృభక్తి విదితమగుచున్నది. ఈ పుస్తకము శైవమత సాహిత్యముపై పరిశోధన చేయునట్టి విద్యార్థులకును ఎన్నియో విషయములనందించును.

ఇందు అక్కమహాదేవి వైరాగ్యము, రాణి సుగ్గలదేవి ధార్మికనిష్ఠ, దుర్గళవ్వ పతిభక్తి, ముక్తాయి నాగమ్మల సోదర వాత్సల్యము, లక్కమ్మ సంతుష్టి పరత, బొజ్జమహాదేవి మాతృప్రేమ మొదలగు అనుభవజ్ఞానము నన్నెంతో ఆకర్షించినవి. ఈశివశరణుల చరిత్రలను చదివినచో పన్నెండవ శతాబ్దియందలి స్త్రీలు ధార్మిక, సామాజిక, విద్యారంగములయందు పురుషులతో సరితూగడమే కాక, అనేక సందర్భములలో పురుషులకు మార్గదర్శకులై తమ జీవితములతోపాటు పురుషుల జీవితములకును సార్థకత చేకూర్చిరి. ఇది నాటి, నేటి, రేపటి స్త్రీజాతికే గర్వకారణమైన విషయము. శ్రీ వీరయ్యగారు ముందు ముందు మరెన్నో ఆదర్శప్రాయములగు శివశరణురాండ్ర చరిత్రలను ఆంధ్రమహిళా లోకమున కెరిగించ వలయునని కోరుచున్నాను.

చిక్కడ్‌పల్లి, హైదరాబాదు
19-5-1989

డా. పి. సరస్వతి
తెలుగు లెక్చరర్
డా. అంబేడ్కర్ కాలేజీ

శివాయనమః

# వివరము

పన్నెండవ శతాబ్దమునంచు భారతదేశమున ముఖ్యముగా, దక్షిణ భారతమునందలి కర్ణాటక ప్రాంతమున, ధార్మికముగాను సాంస్కృతికముగాను గొప్ప క్రాంతి గలిగినది. ఆ క్రాంతి పరిణామము దేశమునందలి నలుమూలల యందు వ్యాపించినది. ఆ క్రాంతిని విజయవంతముగా సాగించిన శ్రేయస్సు ఆ నాటి వీరశైవశరణులకు దక్కినదనుట చరిత్ర సమ్మతము. ఈ శరణుల సంఖ్య, 'బసవపురాణము' నందు వర్ణింప బడినటులు, లక్షతొంబదియారువేలు. వీరిని 'అసంఖ్యాకుల'నియు కూడ సంబోధింపబడినది.

ఈ శివశరణుల శ్రేణిలో బసవేశ్వరుడు, మణిమాలయందలి 'మేరుపూస' వలె ప్రాముఖ్యము నొందినందున, ఆకాలమును 'బసవ యుగ' మనియు; ఆ నాటి శివశరణులను 'బసవయుగమునాటి శివశర ణుల'నియు అందురు.

ఈ శివశరణుల, శరణురాండ్ర జననము, అభివృద్ధి, ప్రచార కార్యములు కర్ణాటకమునందేగాక తెలుగు, తమిళము, కేరళ మొదలగు దూర ప్రాంతములకును ప్రాకి భక్తిమార్గము నభివృద్ధి పరిచినందున వారు సమగ్రభారతమునకు సంబంధించినవారుగా భావింపబడుచున్నారు.

మహాకవి పాల్కురికి సోమనాథుడు, బసవేశ్వరునిచరిత్రతోబాటు ఆనాటి కొందరు శరణుల, శరణురాండ్ర చరిత్రలను తన బసవపురా

ణము సందును, పండితారాధ్యచరిత్ర యందును తెలిపి భారతస్త్రీ
సకు ముఖ్యముగా ఆంధ్ర కర్ణాటకదేశములకు మహోపకార మొన్న
అటులనే బసవయుగమునందలి ప్రముఖ శరణుల శరణురాండ్ర న్యా
లను లింగ, వర్ణ వృత్తి భేదములు లేక సమానభక్తితో అందరిని
శ్రేణియందు చేర్చి ఆంధ్ర, కర్ణాటక భాషలయందు "గణసహస్రనామ
యను పేరుతో ప్రోగుచేసిన ఘనతను కూడ పొందెను. ఇప్ప
కన్నడ తెలుగు ప్రాంతముల యందలి కొన్ని కుటుంబములతో '
సహస్ర నామావళి'ని ప్రతిదినము పారాయణ రూపమున అందలి శర
శరణురాండ్రను స్మరించుచు వారియెడ తమకుగల భక్తిభావమును తె
నేమము గలదు.

అసంఖ్యాకులగు శివశరణుల చరిత్రలు, మహిమలు, అను
వచనములు, వానియందలి జ్ఞాన వివేచనములు మొదలగు అంశ
తెలుపుచు సంపూర్ణ చరిత్రలను వ్రాయుట గొప్పయోజన. దానికి చారి
పరిశోధనము, సాహిత్య పరిచయము ఆధ్యాత్మిక అనుభవము, షట్స్థ
విజ్ఞానము మొదలగు విషయముల పరిజ్ఞానము అవసరము. అట్టి మ
నీయులు మున్ముందు ఆ పనికి బూనుకొని శివశరణుల సంపూర్ణ పరిచ
మును తెలుగు లోకమునకు కలుగజేయుదురని విశ్వసించుచున్నాను.
వేశ్వరుని సమకాలీనులగు శివశరణులును, శరణురాండ్రును అను
మంటపము నందలి అనుభవ గోష్ఠులలో పాల్గొనుచు, తమతమ అను
వచనములను వచించుచుండి రనునది సర్వజనవిదితము. అసంఖ్యా
లగు శరణుల వచనములసంఖ్యకూడ అసంఖ్యాకముగానే యున్న
ఐనను కన్నడ దేశమునందు కొందరి వచనములు కొన్నికొన్ని మాత్ర
ప్రస్తుతము ఉపలబ్ధమైనవి. ఆ ఉపలబ్ధమైన వచనములైనను తెలు

జనులకు తెలియునట్లు అనువాదము జేయుటయు గూడ గొప్పయోజనయే! ఇప్పుడిప్పుడు ఈ దిశయందు తెలుగుపండితులు, సాహిత్యాభిమానులు ప్రయత్నించుచున్నారు. శివానుభవ గ్రంథమాల యందు బసవేశ్వరుని, చెన్నబసవేశ్వరుని కొన్ని కొన్ని వచనముల అనువాద పుస్తకములను చతుర్థ, షష్ఠమ బిల్వములుగా ప్రకటింపబడినవి. బెంగళూరు బసవ సమితివారు బసవేశ్వరుని అష్టశతజయంత్యుత్సవ సందర్భమునందు 'బసవవచనామృత'మను పేరుతో అతని 108 వచనముల అనువాద పుస్తకమును ప్రకటించియున్నారు. ఇంతకు పూర్వమే (సుమారు 33 సంవత్సరముల క్రితము)'బసవవచనామృతమ'ను పేరుతోనే అతని 108 వచనముల అనువాదపుస్తకమును, విపులపరిచయవ్యాసముతోను, పండితాభిప్రాయములతోను ప్రకటించి తెలుగుతల్లికి 'కించిత్' సేవజేయు భాగ్యమును పొందియుంటిని.

లింగైక్యులు శ్రీ జీ. టి. అక్కలయ్య దీక్షితులుగారు సుమారు ముప్పది సంవత్సరముల క్రిందట అక్కమహాదేవి 182 వచనములను అనువదించిన పుస్తకము సర్వశ్రీ మా. నం. నంజప్ప సహోదరులు (బెంగళూరు) ప్రకటించి ఆమెవచనముల పరిచయము ప్రప్రథమమున ఆంధ్రలోకమునకు కలిగించియున్నారు.

పరమపూజ్యులు తరళబాళు జగద్గురువులు శ్రీశ్రీశ్రీ శివకుమార శివాచార్య మహాస్వాములువారి ఆదేశానుసారము మిత్రులు శ్రీ డా. బొడాల రామయ్యగారు (మైసూరు యూనివర్సిటీ తెలుగుశాఖాధ్యక్షులు) బసవేశ్వరుని వచనముల నన్నింటిని అనువదించి తెలుగులోకమునకు మిక్కిలిఉపకార మొనర్చి యున్నారు. సుమారు ఒకసంవత్సరము క్రిందట 'గమక కళానిధి' శివ శ్రీ కె. దొడ్డనగౌడ జోళదరాసి (బళార్రి

జిల్లా) వాస్తవ్యులు కొందరు శివశరణుల కొన్ని కొన్ని వచనము
అనువదించి 'వచనామృత'మను పేరుతో నొకపుస్తకమును ప్రక
యున్నారు. ఆ పుస్తకమును ఆంధ్రసారస్వతపరిషత్తు సమావే
సందు గౌ॥ డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు దయతో ఆవిష్క
గౌరవించి యున్నారు. నాకు తెలియని అనువాద పుస్తకములు
మరికొన్ని ప్రకటించబడి యుండినను యుండవచ్చునని నేను భావి
చున్నాను. ఈ ప్రయత్నముల ఫలితముగా ఆంధ్రలోకమునకు క
వచనవాఙ్మయము - అందలివిశేషముల పరిచయము కొంతవరకై
కలిగినదని సంతసింపనగును. ఐనను ఈ దిశయందు యి
యెక్కువ పరిశ్రమ అవసరమని నేను తలంచెదను.

ప్రస్తుతము అక్కమహాదేవి అన్నివచనముల అనువాదపు
కము విపులపరిచయ వ్యాసముతో శివానుభవగ్రంథమాలయందు ప్రక
చుటకు సిద్ధముగా నున్నది. శివలెంక మంచన్నగారి అన్నివచన
చెన్నబసవేశ్వరుని మరికొన్ని వచనములు, అల్లమప్రభువుని కొ
వచనములు అనువదింపబడినవి. అవికూడ తెలుగువెలుగు లోనికి వ
టకు తగు అవకాశమును ఎదురు చూచుచున్నవి. శివానుగ్రహము
అచిరకాలమునందే ఆ పుస్తకములు ప్రకటింపబడు 'సదవకాశము లభి
నని విశ్వసించుచున్నాను. నేను పంపిన అక్కమహాదేవి కొన్ని వ
ములను 'శ్రీశైల ప్రభ'యందు, మరియు శివలెంక మంచన్న వచన
లను కొన్నింటిని 'భారతి' యందును ప్రచురించి నందులకు ఆయా ప
కల సంపాదకమహాశయులకు నేను మిక్కిలి కృతజ్ఞుడను.

శివశరణుల శివశరణురాండ్ర వచనములతోబాటు వారివారి చ
లను కూడ ప్రకటించుట శివానుభవసమితి యుద్దేశములలో నొకటి

యున్నది. శివశరణుల సంఖ్యవలెనే శివశరణురాంౘ్ర సంఖ్యయుకూడ అధికముగా నున్నది. అయినను పతిభక్తి, సదాచారము, న్యాయనిష్ఠురత, సంతృప్త జీవనము, ఆత్మజ్ఞానము మొదలగు సద్గుణములకు నిదర్శనములుగా నున్న శివశరణురాంౘ్ర జీవితములను సమకూర్చి "వీరశైవ మహిళా శివశరణులు" అను ఈ చిన్న పుస్తకమును రచించితిని. బసవప్రియ, మజ్జనని. కుంకుమశోభిత, లింగైక్య మాతృశ్రీ సిద్ధమ్మ దివ్యమూర్తిని మదిని తలంచుచు మాతృభక్తితో ఆమె శ్రీపాదములకు ఈగ్రంథసుమమును, నాదెబ్బది రెండవ జన్మదిన సుమముగా సమర్పించు చున్నాను.

మహిళామతల్లులు, ఆదర్శప్రాయములగు ఈశరణురాంౘ్ర జీవితము లందలి భావములను గ్రహించి తమతమ సాంసారికజీవితములను, ఆనందమయములుగాను, ముక్తిసాధకములుగాను నొనరించు కొనగలిగిన నా ఈ ప్రయత్నము సఫలమైనదని తలంతును.

నా ఈ పుస్తక రచనకు ఆధారముగా సహాయపడిన గ్రంథకర్తలకును, ప్రకాశకులను నా హృదయపూర్వక కృతజ్ఞతలను తెలుపు చున్నాను. నా ఈ 'కించిత్' సారస్వత సేవను అభినందించుచు అమూల్యాభిప్రాయము నొసగిన విద్యాధికులకు నా సవినయ నమస్కృతుల దెలుపు చున్నాను.

చివరకు ఈ పుస్తకమును శివానుభవగ్రంథమాలయందు 'ఏకాదశ' బిల్వముగా ప్రకటించి ప్రోత్సహించినందులకు శివానుభవ సమితి సంచాలనవర్గము వారికి నా కృతజ్ఞతలను తెలుపుచున్నాను.

శివం భూయాత్

ఉందాబజారు
హైదరాబాదు-2.
5-12-1979

భక్తజనవిధేయుడు
రేకిళిగె మఠం వీరయ్య



వీరవిరాగిణి అక్కమహాదేవి

# వీరవిరాగిణి అక్కమహాదేవి

గోముఖపు పులులను మీరిన,
కామము మొదలగు విషయాదుల,
స్థోమతను ద్రుంచి, తనయంతరంగమున
ఆ మహాశివలింగ సంగమ ప్రేమియై శివైక్యమొందిన
ఆ మహాదేవి యక్కకు శరణు శరణార్తి.

—చామరసు-(అనువాదము)

అక్కమహాదేవి, శివశరణులాంధ్ర యందు మణిమకుటమువంటిది. అక్కమహాదేవి గురించి మహాకవి పాల్కురికి సోమనాథుడు తన బసవ పురాణమునందు విపులముగా వ్రాయలేదు. కాని అతని శిష్య ప్రశిష్యు డగు, శివకవి పిడుపర్తి సోమనాథుడు తన 'ప్రభులింగలీల' (చామరసు కృత కన్నడ ప్రభులింగలీలకు తెలుగు అనువాదము) యందు కొంత విస్తరించినాడు. కన్నడ వాఙ్మయమునందు ఆమెను గురించిన సాహిత్యము విపులముగా నున్నది. ఆమె ఉడుతడి గ్రామము నందలి శివ ధర్మానుయాయులగు సుమతి, నిర్మలసెట్టియను, సదాచారసంపన్న దంపతులకు బుట్టిన కుమార్తె. ఆమె పుట్టుకతోనే అఖండ శివభక్తి సౌశీల్యము, పరిపూర్ణతత్త్వ జ్ఞానము, సాహిత్యకళ, వైరాగ్యతేజములు బీజరూపముననే ఆమె యందు గలిగియుండెను.

ఆమె వయసుతోబాటు, సుగుణములుకూడ ఆమెయందు అభివృద్ధి చెందుచు వచ్చెను. నవయౌవనమునకు రాగానే, ఆమె

రూపలావణ్యములతోబాటు, ఆ తేజస్సు ఆ సుగుణములు, నవవికసిత కుసుమమందలి పరిమళమువోలె, అందరిని ఆకర్షించుచువచ్చెను.

ఒకనాడు ఆపూరి అధిపుడు, కౌశికుడు, వ్యాహ్యాళికి వెళ్లినపుడు, తనవాకిలి ముందట నిలుచుండిన అక్కమహాదేవిని గాంచి, ఆమె సౌంద ర్యమునకు మోహించి, కామోద్రేకభరితుండై తన వ్యాహ్యాళిని రద్దుపరిచి, రాజభవనమునకు తిరిగి పోయెను. చారులను పిలిపించి, తాను జూచిన సుందరి "యెవ్వరనునది తెలుసుకొని, ఆమెను తన అంతఃపురమునందు చేర్చు"మని ఆజ్ఞాపించెను. ఆ చారులు ఆమె నిర్మలసెట్టి-సుమతి యను దంపతుల కుమార్తెయని తెలుసుకొని వారింటికి బోయి, రాజు కోర్కెను తెలిపిరి. వారు సమ్మతించ నందున, కౌశికుడు తన నమ్మకముగం మంత్రిని పంపెను ఆ మంత్రి, మహాదేవికి, ఆమె తల్లిదండ్రులకు రాజదండన భయము పెట్టెను. అప్పుడు మహాదేవి, "కౌశికుడు తన మూడు నియమములకు అవరోధమును కలుగించ నటులు ఒప్పుకొనిన తాను రాజభవనమునందు ప్రవేశింతున"నియు, "కౌశికుడు ఆ మూడు నియమములకు అవరోధము కలిగించిన వెంటనే తాను రాజభవనమునుండి వెడలిపోవుదు"నని అనెను. కౌశికుడు కామాతురతతో మొదట 'సరే' ననెను. కాని, కామోద్రేకము వలన తానంగీకరించిన నియమ ములకు అచిరకాలముననే అవరోధమును కలిగించుటయే గాక, తన మేచ్చను తీర్చుకొనుటకు ఒకనాడు ఆమెపైబడ జూచి, చీరెను లాగెను. అంత మహాదేవి కోపోద్రేకముతో 'ఛీ పశువా, నన్ను విడువు'మనుచు చీరను విప్పి పారవైచి. కేశాంబరియై రాజభవనమునుండి వెడలి పోయెను. ఆమె తల్లిదండ్రులు, పూరివారలు ఎంతవలదన్నను వినక, "చావుబ్రతుకుల మగడు నాకెందుకమ్మా! శివుడేని చెడుపులే

చెన్నమల్లికార్జునుని కూడి సఖ ముండెద నని "మీ బిడ్డ నేగాను-మీరింకనుండి, మాబిడ్డ యనియెడు మమత వాయుండు. హరునకు నా దేహ మర్పించినాను, గురునాథుఁ ప్రభువు గన్గొన బోదు నని"* ఉడుతడిని విడిచి కల్యాణకటకమునకు ప్రయాణ మయ్యెను.

మహాదేవి, లౌకిక వైభవమునకు మరులు జెందక, భయభీతులను లజ్జలను వదలి, సర్వసంగ పరిత్యాగినియై

"ఆకలి గలిగిన భిక్షాన్నములు గలవు
దప్పిగలిగిన ఏరు, బావి, చెరువులు గలవు
నిదుర వచ్చిన పాడుగుళ్లు గలవు.
చెన్నమల్లికార్జునా! ఆత్మసాంగత్యమునకు నీవు గలవు".

అనుచు చెన్నమల్లికార్జునుని యందు అనన్యమగు సాత్త్విక ప్రేమను మనసున నిల్పి అడవు లనక, చెట్లనక, గుండ్లనక, ముండ్లనక అతనిని వెదుకుచు వెడలిపోయెను.

అప్పుడు కల్యాణకటకము నందలి, 'అనుభవమంటపము'నందు బసవాది శివశరణుల అనుభావగోష్ఠులవలనను, ప్రభుదేవుని తత్త్వోపదేశ ములవలనను చెన్నబసవన్న షట్స్థలతత్త్వనిరూపణవలనను కల్యాణ పట్టణము యెల్లరకును ఆత్మకల్యాణము నొసగునట్టి షట్స్థలతత్త్వ జ్ఞానపీఠముగా నుండినది. మహాదేవి అనుభవమంటపము నందలి బోధల వలనను అనుభావులగు శరణుల సాంగత్యమువలనను, తనప్రియుం డగు చెన్నమల్లికార్జునుని ఒనగూడు సాధనమును తెలియ గలుగుదునని,

* ప్రభులింగలీల పుట 80. పిడుపర్తిసోమనాథకవి. పరిష్కర్త: లిం. బండారు తమ్మయ్య (1963)

కల్యాణమునందలి అనుభవమంటపమునకు బోయెను. అక్కడ పరివేష్టి యున్న బసవాది శివశరణులను శూన్య సింహాసనముపై ఆసీను యున్న అల్లమప్రభువును, ప్రక్కనున్న షట్స్థల చక్రవర్తి చె బసవన్నను గాంచి మనసున ఆనందాతిశయమును పొందుచు, అ మహాదేవి "శరణు శరణార్థి" యని నిలుచుండెను. అమె నిజస్థి అనుభవమంటపమునందలి శరణులకు విశదమగునట్లు తెలియజే వలయునను తలంపుతో అల్లమ ప్రభువు;

"గోకయు మొలగట్టుకొన కాడుదాన, వీగతి నీవున్న నిం వేళ, లాగుగా జూతురేలా వచ్చితిరనిన" అక్కమహాదేవి "జగ భరితుని సతికి గోకేల ? దగులేల ! తనుమనోధన సంగముల విడచిన నాకు దియ్యవిల్కాని, మొగమోటలేలను ముక్కంటి శరణు నేల ? నన్నొకలాగుగా జూడ, వికృతి బాసిన నాకు వేష మేమిటికి" అనుచు వుత్తర మొసగెను.

అల్లమప్రభువు ఇతర శివశరణులు, ఆమె వైరాగ్యమును ఆ యందలి తత్త్వజ్ఞానమును పరీక్షించుటకు. అనేకప్రశ్నలను వేసి అన్నింటికిని ఆమె లింగము మెచ్చి 'ఔనౌ' ననునట్లు సమాధానమ నొసగెను. అప్పుడు అనుభవమంటపమునందలి శివశరణు లందరు ఆమె సర్వసంగపరిత్యాగమునకును, తత్త్వజ్ఞానమునకును మెచ్చుకొని 'అక్క' అను గౌరవపదము నిచ్చి ఆమెను అనుభవమంటపమునంద గోష్ఠులయందు పాలుగొనుటకు ఉన్నతాసనమును నియమించిరి. శరణ లందు లింగ, వర్ణ, వృత్తి, వయసు, భేదరహితమగు సమతకు నిదియొ నిదర్శనము.

* ప్రభులింగలీల – పుట 131.

అక్కమహాదేవి అనుభవమంటపము నందలి అనుభావగోష్ఠుల యందు, చర్చలయందు పాలుగొనుచు, తన అనుభావవచనములను విని పించుచు సంపూర్ణఅనుభావియై తన ఆత్మపతియగు చెన్నమల్లికార్జునుని యందు ఐక్యమగు ఉద్దేశముతో శ్రీశైలమునకు పోవుటకై అల్లమ ప్రభువును అనుజ్ఞవేడెను. అల్లమప్రభువు తన అనుభావముతో "శ్రీశైల క్షేత్రమందలి కదలీవనమునందు చెన్నమల్లికార్జునుని ధ్యానించుచు అచ్చట ఐక్యమగుము-పొమ్మని" శెల విచ్చెను. ఆ ప్రకారముగ అక్కమహాదేవి శ్రీశైలక్షేత్రమునందలి కదళీవనమునందు ఏకాంతస్థలమగు నొకగుహ యందు శివయోగధ్యానమునందుండి లింగైక్యము చెందెను.

అక్కమహాదేవి గొప్ప సాహిత్య నిర్మాత. ఆమె వచించిన వచ నములు వచన వాఙ్మయమునందు మిక్కిలి ఉన్నతస్థానమును పొంది యున్నవి. ఆమె షట్‌స్థలవచనములనేగాక, సృష్టివచనములును "యోగాంగత్రివిధిని" (త్రిపది) మరియు అనేక పాటలను రాగ తాళ బద్ధములుగ వచించియున్నది. అవి కన్నడవాఙ్మయమునందు జీవమణుల వలె ప్రకాశించుచున్నవి ఆమె కొన్ని వచనములు క్రింద వ్రాయబడినవి.

౧. నేలమరుగున నున్న నిక్షేపమువలె
ఫలము మరుగుననున్న రుచివలె
శిలల మరుగుననున్న హేమమువలె
తరుల మరుగుననున్న తేజమువలె
భావము మరుగున బ్రహ్మమైయున్న
చెన్నమల్లికార్జునుని ఉనికి తెలియరానిది.

౨. పాలయందున్న నెయ్యి కనిపించునా ?
సూర్యకాంతియందున్న యగ్ని

నెవరు వేరు పరచగలరు ?
అపారమహిమా, చెన్నమల్లికార్జునా !
నీవు నాయందడిగి యున్నను
నిన్నువేరుగా జూచి, కన్ను దెరిచితినయ్యా !

౩. నాదేహము మట్టి బొమ్మ !
నాజీవము బట్టబయలు
దేనిని బట్టుదునయ్యా ! నేను
నిన్నేతీరున స్మరింతునయ్యా ! నేను
ఈమాయను తప్పించుమయ్యా
చెన్నమల్లికార్జునయ్యా ?

౪. అమేధ్యపు కడవ, మూత్రపు బుడిగె
ఎముకల తడక, చీముబుడ్డ
కాలిపోనీ! ఈదేహమును
ఈ ఒడలిని నమ్మి, చెడకుము
చెన్నమల్లికార్జునుని తెలియని మూర్ఖుడా !

౫. లోకపుచేష్టలకు రవి బీజమైనటులు
కరణాదుల చేష్టలకు మనసే బీజము
నాకు గలదొక మనసు
ఆమనసు నీయందు లీనమైనచో
నాకిక భవమున్నదా ? చెన్నమల్లికార్జునా !

౬. చిలిమిలి చిలిమిలియని
పలికెడు చిలుకలారా !

మీరు కంటిరే మీరు కంటిరే !
కంఠమెత్తి కూయుచున్న కోయిలలారా !
మీరు కంటిరే మీరు కంటిరే !
మధువాని తిరిగెడు, భ్రమరములారా !
మీరు కంటిరే మీరు కంటిరే !
గిరి గహ్వరములయం దాడెడు నెమలులారా !
మీరు కంటిరే మీరు కంటిరే
కొలనులం దీదెడు కలహంసలారా !
మీరు కంటిరే మీరు కంటిరే !
చెన్న మల్లికార్జునుడెచ్చట
నున్నడని మీరు తెలుపరే, మీరు తెలుపరె.

౭ భ్రమర సమూహమా, మామిడివనమా
నిండువెన్నలా ఓ కోకిలా
మిమ్మెల్లర నే నొకటి వేడెద
నా యొడయుడు చెన్నమల్లికార్జునదేవుని
మీరు చూచిన పిలిచి చూపుదురా !

౮ అంగ సంగమందు లింగసంగినైతిని
లింగసంగమందు అంగసంగినైతిని
ఉభయ సంగముల నరయక
పరిణామినైతిని
నుడిగడణము మరచి
గుఱుతు తెలియకుంటిని

నాదేవుడు చెన్నమల్లికార్జునియందు
కూడిన పిదప
నన్ను నేనేమని తెలియుదునయ్యా !

౯. వనమంతయు కల్పతరులు
తరులన్నియు జీవగఱ్ఱము
శిలలన్నియు స్పర్శవేదులు
వేలయంతయు అవిముక్త క్షేత్రము
జలమంతయు నిర్ఝరామృతము
మృగములన్నియు కామధేనువులు
గులకరాళ్లన్నియు చింతామణులు
చెన్నమల్లికార్జు నయ్యమెచ్చినగిరిని
చుట్టి, చూచి, వచ్చి
కదళివనమును గంటినినేను

౧౦. కదళి యనునది తనువు కదళియనునది మనము
కదళి యనునది విషయ సంకులము
కదళియనునది భవ ఘోరారణ్యము
ఈ కదళి దాటి బ్రదికివచ్చి
కదళీవనమందు భవహరుని గంటిని
భవమును గెలిచి వచ్చిన 'పుత్రీ' రమ్మనుచు పిలిచి
బిగికౌగిట చేర్చుకొనగ
చెన్నమల్లికార్జునుని హృదయ
కమలమందు నిండుకొంటిని

—o—

# శివాచార పరాయణి రాణి సుగ్గలాదేవి

సుగ్గలాదేవి చాలుక్యరాజ్య సార్వభౌముండగు, ఇమ్మడి జయ సింహుని పట్టపురాణి. ఆమె తన కులగురువగు, దేవరదాసిమయ్య గారితో లింగదీక్షను బొంది. లింగధారియై, అత్యంతనిష్ఠతో ఇష్టలింగ మును పూజించుచు, శివానుభావగోష్ఠిని ఇష్టముతో వినుచు, శరణులను అత్యంతాదరముతో సంతుష్టి పరుచుచు, అనుభావజ్ఞానయై యుండెను. జయసింహుడు జైనమతానుయాయియైయున్నను, రాణి సుగ్గలాదేవి, తాను వీరశైవాచారసంపన్నయై యుండియును, లేశమాత్రమైనను, ఇతర మతానుయాయియైన తనభర్తపై ఈర్ష్యాసూయలులేక అత్యంతభక్తితో దాంపత్యజీవితమును సాగించుచుండెను.

చాళుక్య సార్వభౌముడు, జైనమతావలంబియై యున్నను, అతని రాణి శైవాచార పరాయణియగుట వలన; వీరశైవాచార్యులు, శివశర ణులు రాజసభలయందు జైనమతాచార్యులతో సరిసమాన గౌరవమర్యాద లను పొందుచుండుట జైనమతాచార్యులు సహింపక, రెండు మతము లలో "ఏది ఉత్కృష్టమైన"దను వాదమును లేవదీసి, ఆ విషయము చర్చింపబడి నిర్ణయము గావలయునను అభిప్రాయమును ప్రభువు మన సున నాటునట్లు బోధించిరి. ప్రభువునకు వీరశైవాచారమునందు గలిగిన అగౌరవ భావమును రాణి సుగ్గలాదేవి గ్రహించి, వివాదమునకు సభను ఏర్పాటు చేయించుమని రాజును గోరెను. ఆ వివాదములో ఏ మతము ఉత్కృష్టమైనదని తేలినా, పరాజిత మతానుయాయులు, విజేత మతానుయాయులు గావలయునను ఒడంబడికను ఇరుపక్కలవారును

అంగీకరించిరి. జైనులు తమపక్షమునుండి రాజగురువగు స్వ
నేమి యను జినమునిని నేమించుకొనిరి. రాణియును తమ గురు
దేవరదాసిమయ్యను వీరశైవమత ప్రాశస్త్యమును గురించి వాదు
టకు అంగీకరింపజేసెను.

ఈ ప్రకారముగా ఇద్దరు మతాచార్యులును తమ తమ మత ప్రా
స్త్యమును గురించి వాద-వివాదములను జరిపిరి. ఆ వివాదమునం
విజయము దేవరదాసిమయ్యగారికి కలిగెను. శివశరణులు గెలుపొం
జైనులు పరాజితులైరి.

ఒడంబడిక ప్రకారము రాజు జయసింహుడు, మరియు అతని
వారమంతయు దేవరదాసిమయ్యగారితో లింగదీక్షనుబొంది లింగారా
శివాచార పరాయణులైరను ఐతిహ్యము గలదు.

ఈ సంఘటన ఆ ప్రాంతమునందు వీర శైవమత ప్రాబల్యమున
గొప్ప అనుకూలమును కలిగించెను. రాణి సుగ్గలాదేవియును వీరశై
మత ప్రచారమునందు తమ గురువగు దేవదాసిమయ్యగారికి చేదో
వాదోడుగా నుండి, అన్నివిధముల అనుకూలములను కలిగించుచుండె
సుగ్గలాదేవి జేసిన శరణ దాసోహమునకును, ధార్మిక సేవకును స్మా
ముగా పురాతన శరణురాంధ్ర (కన్నడ) త్రిపదియందు ఆమె ప్ర
మరియు పాల్కురి సోమనాథుడు కూర్చిన గణ సహస్ర నామావళియం
ఆమె పేరు గానవచ్చుచున్నది. అందువలన, ఆమె ప్రఖ్యాత శివశర
రాలని విశదమగుచున్నది. ఆమెకూడ అనుభావవచనమును వచిం
నటులు ప్రతీతిగలదు.

రాణి సుగ్గలాదేవి శ్రీశైల మల్లికార్జున దేవస్థానముయొక్క
అభివృద్ధి గురించి అనేక దానధర్మములు చేసినట్లును ఐతిహ్యముగలదు.

—:o:—

# పతిభక్తి పరాయణి దుగ్గలాదేవి

దుగ్గలాదేవి ఆ కాలమునందలి శివశరణురాంద్రలో ప్రఖ్యాత శరణురాలు. ఈమె ౧౦౧౪ నుండి ౧౦౪౨ వరకు *'పొట్టలకెరి,' రాజ్యము నేలిన చాలుక్య చక్రవర్తియగు, ఇమ్మడి జయసింహుని సమకాలీనుడగు దేవరదాసిమయ్యగారి పత్ని. దేవర దాసిమయ్య జయసింహుని పట్టపురాణియగు సుగ్గలదేవి కులగురువుగా నుండి ఆమెకు శివదీక్షయొసగి తన భక్తురాలినిగా యొనర్చుటయేగాక, ఆ ప్రాంతమునందు వీరశైవాచారమును ప్రసరింపజేసినట్లు, ఐతిహ్యము గలదు. దాసిమయ్య ప్రఖ్యాత విద్వాంసుడు. షట్స్థల తత్త్వజ్ఞాని, అనుభావి, వచనకర్త, రాణి సుగలాదేవి కులగురువు అయ్యేయుండియు. నేతకాయకమును తన నిత్య జీవనాధారముగా గైకొని యుండెను. ఆ కాయకలబ్ధమగు ఆదాయముతో ఆదంపతు లిరువురును సంతృప్తి చెంది, తమ తను మన,ధనములను గురు లింగ జంగమముల దాసోహమునందు వ్యయపరుచుచు త్రివిధ దాసోహమూర్తులుగా నుండిరి.

ఈ దంపతుల భక్తిపారవశ్యమునకు శివుడు ప్రసన్నత జెంది వారికి 'తవనిధి' (ఎల్లప్పుడును, తరగని ధాన్యరాసులు నుండునట్లు) వరము నిచ్చెను. ఆ వరము వారి దాసోహ కాయకమునకు మరింత

---

* "పొట్టలకెరి" నేటి ఆంధ్రప్రదేశ రాష్ట్రమందలి మెదకు జిల్లాకు చెందిన పటంచెరు, అని నామాంతరము చెందియుండునని కొందరి ఊహ గలదు. ఇచ్చట కొన్ని పురాతన చారిత్రక అవశేషములు గలవు.

అనుకూలముగా నయ్యెను. దుగ్గలాదేవి అత్యంత పతిభక్తురాలు. పతి యాజ్ఞ జవదాటక, అతనిని ఆరాధించుచుండెను. అతని దా... కార్యములయందు, ఆమె అతనికి చేదోడువాదోడుగా నుండెను. ఒక... ఆమె వడ్లు దంచుచుండగా, ఆమె పతి 'మంచినీళ్ళ నిమ్మ'నెను. పైకెత్తిన రోకలి నట్లేవిడిచి, తనభర్తకు మంచినీళ్లు తేబోయినది. పాతివ్రత్య బలముచే, ఆమె తనభర్తకు మంచినీళ్ళ నిచ్చి వచ్చువ... రోకలి క్రిందబడకుండ అట్లే నిలుచుండెను. ఒకనాడు మగ్గము ... చున్న దేవరదాసిమయ్య పగలే, ఆమెను దీపమును వెలిగించుకొని... వెను. ఆమె 'పగలు దీపమెందు'కని తర్కించక, దీపమును వెలి... కొనివచ్చెను.

దాసిమయ్య కొన్నాళ్లు శ్రమించి నేసిన చీరను అమ్ముటకని గొని... నప్పుడు దారిలో నొక జంగముడు దానిని అడిగెను. దాసిమ... ఆ చీరెను ఆ జంగమునకు దానమిచ్చి రిక్తహస్తముతో ఇంటికి వచ్చె... అది తెలిసి దుగ్గలమ్మ పతి నేమనక, పతి దానప్రవృత్తికి సంతసి... సంతృప్తిగా నుండెను. వారి జీవితమునందు ఇట్టి సంఘటనలు ... కొన్ని గలవు. ఇవి వారిరువురి దాసోహనిష్ఠను, దైవభక్తిని తెలుపు...

వారి దైవభక్తిని, విశ్వాసమును బసవేశ్వరుడు 'కొలమానము' గ్రహించి ఇతర పురాతన శివశరణులతోబాటు వారినికూడ తన వచన... లందు

"భక్తి ఎటులుండునయ్యా?
దాసిమయ్య చేసినటులుండునయ్యా" అనియు,
"నెరనమ్ము మో, నెరనమ్ము మో!
దాస దుగ్గళులవలె"
అనుచు ప్రస్తుతించి యున్నారు—

ఈ దంపతులిరువురును అనేక అనుభావవచనములను వచించి యున్నారు. దాసిమయ్య 'రామనాథ' అను మకుటముతో వచించి యున్నారు—

దాసిమయ్యగారి వచనములు

(౧) సతిపతు లొకటయై జేయుభక్తి
హితమై యుండును శివునకు,
సతిపతు లొకటిగాని భక్తి
అమృతమునందు విషమును
కలిపినటులు రామనాథా.

(౨) పరవధువును గోరక
పరధనములు ముడువక
పరదైవమును వేడక
గురు లింగ జంగమములకు
వరదాసుడై యుండునతడు
గురువై యుండును ముల్లోకములకును రామనాథా.

(౩) మగనాలిని మంగళగౌరిగా జూచిన
భూపతియై బుట్టునతడు, భూమండలమున
మగనాలిని జూచి. కన్నుగీటినవాడు
నరకకూపమునందు బడియుండునతడు-రామనాథా.

దుగ్గలాదేవి కూడ అనేక అనుభావవచనములను వచించినటులు ప్రతీత గలదు గాని ఆమె వచనములు మన కిప్పుడు ఉపలబ్ధముగాక పోవుట మన దురదృష్టమే సరి.

—:o:—

# లింగనిష్ఠాయుక్త ముక్తాయి

ముక్తాయి అజగన్న సోదరి. అజగన్న గుప్త శివభ
వచన వాఙ్మయమునందు అతని వచనములు సుప్రసిద్ధములు. "
దేవుని పదివచనములకు అజగన్న ఐదు వచనములు సాటి", అనుచ
బసవన్నే అతని వచనముల విశిష్టతను తెలిపియున్నాడు. ముక్తా
అజగన్న-వీరిరువురును రైతుకుటుంబమునకు చెందినవారు. శివ
జిల్లాలోని ముత్తగియందు వీరిరువురి సమాధు లున్నటుల తెలియుచు
అజగన్న ఉపదేశమార్గమునందు జనులకు బోధించుటకన్నను, ఆ
మార్గముగా బోధించుట ఉత్తమమనియు. పరిణామకారియనియు తల
చుండెను. పలుకుటకన్న ప్రవర్తనకే అధిక ప్రాముఖ్యత ని
"తక్కువ మాటలు, ఎక్కువ పనులు" అను సామెత ప్రకారము
తక్కువ వచనములు ఎక్కువ అనుభావజ్ఞానమును కూడియున్న వ
వారి వచనముల గురించి చెన్నబసవన్నగారి అభిప్రాయమైయుండును.

ముక్తాయికి అజగన్న సోదరుడు, గురుడునై యుండెను.
ఆమెకు లౌకికముగా పోషణకర్తయైనను, అధ్యాత్మికముగా తన
నచే ఆమెకు శివభక్తిని, శివాచారమును, శివతత్త్వజ్ఞానమును బో
గురువునునై యుండెను. ఇట్లుండగా, కొన్నాళ్ళకు వారి మేనమామ
కుమార్తె శివభక్తులుగానివారితో వివాహమొల్లనని పట్టుబట్టినందున
శివభక్తుండగు అజగన్నతో వివాహమొనరింప నిశ్చయించి అతనిని
పూరికి పిలుచుకొనిపోయెను. అప్పుడు ముక్తాయి, తననిజ

తనను ఒంటరిగా విడిచిపోవుచున్నందువల్ల గలిగిన దుఃఖమును చూచి, అజగన్న ఆమెను ఓదార్చి, తాను ఆమె ఎదుటలేకున్నను తన ఆచరణలను గుర్తునందుంచుకొని ఆచరించుచుండుమని తెలిపెను. ముక్తాయి దూరదేశమునందున్న అన్న ఆరోగ్యస్థితి తనకెటులు తెలియునని అడుగగా, అజగన్న "పెరుగు చిల్కెడు బాన బిట్టు, బిట్టువిసి ధరణి జిందిన నాడె, తనకైక్యమనుచు" గురుతు చెప్పి వెడలిపోయెను *—ముక్తాయి ఆదే ప్రకారము శివపూజ, శివధ్యానమునందుండి, శివాచార ప్రవర్తనతో కాలమును గడుపుచుండెను.

అజగన్న తనమేనమామ కుమార్తెను వివాహమాడి, తన వైవాహిక జీవనమును, సంసార శివయోగివలె గడుపుచుండెను. కాని తన శివభక్తిని గుప్తరీతిగానే ఆచరించుచుండెను. ఇదిచూచి, అతనిపత్ని అతని గుప్త శివభక్తిని తెలియలేక; తనపతి శివభక్తుడు గాడను భావముతో చింతించుచు కాలము గడుపుచుండెను. కొన్నాళ్లకు ఒకరోజు అజగన్న తొందరపాటున బోవునప్పుడు తలుపుచెక్క తాకగా అతడు 'నమఃశివాయ' అని శివుని తలంచెను. ఆదివిని అతనిపత్ని, తనభర్త భవిగాడని. శివభక్తుండేనని తలంచి సంతసించెను. ఇంతవరకు తనభర్త నిగూఢ శివభక్తిని తెలియజాలనందుకు మిక్కిలి చింతించెను, అజగన్న 'తనశివభక్తి బయల్పడె గదా'యని తలంచి, ఇక తన జీవితము చాలని ఎంచి ఒకరోజు లింగనిష్ఠయందుండి, శివైక్యమునొంది బయలయ్యెను.

ఇక్కడ అజగన్నగారు లింగైక్యను కాగానే, తాను తెలిపిన ప్రకారము ముక్తాయి ఇంటియందు "పెరుగు బాన అవిసిన" జూచి, తన గురువును సోదరుడును అగు అజగన్న శివలోకప్రాప్తుడయ్యెనని ఆమె వగచు

* ప్రభులింగలీల-పుట ౪౦.

చూడెను. ఈ సమయమున అల్లమప్రభువు "విరస విషయ భోగవిష పాన ముడిపి సరసశివజ్ఞాన శర్కర మపపి। పరిపూర్ణ విజ్ఞానభరితుల జేయ ధర జరియింపంగ దత్సమయమున," ముక్తాయిని జూచి 'దుఃఖ కారణ మేమని' ఆమెను విచారించెను.[1] ముక్తాయి తనకు గురువును సోదరుడును అగు అజగన్న తనను ఒంటరిగా, అపక్వజ్ఞానిగా విడిచి శివలోక ప్రాప్తు డయ్యెననియు, అదియే తన దుఃఖమునకు కారణమనియు తెలిపెను.

అల్లమ ప్రభువు అజగన్న పేరువిని అత్యంత ఆనందభరితు డయ్యెను. తన అన్న పేరు వినగానే సంతసించిన మనిషి ఇతడుగూడ తనఅన్నవలె అనుభావజ్ఞానియై యుండు నని ముక్తాయి తలంచి, తన అన్న గురించిన సమాచారమును ఇతనిని అడిగి తెలుసుకొనవచ్చునని భావించెను.

"నాకేడుగడయని నమ్మియుండితిని, నాకెరిగించక ననుడాగి పోయె। సవిశేష జంగమార్చనల విధంబు, శివభక్తి మర్మంబు శీలవ్రత ములు నివ్వటిల్లెడు కృప నిత్యంబు దెలిపి, యెవ్వరు నాకింక నిరవు కొల్పెదరు నా గురుస్వామియై నన్ను రక్షించి, యీగతి విడిచిపోయిన నెట్టు లోర్తు "[2] అనుచు తన అన్న, తనకు గురువుగానుండి, శివానుభావ జ్ఞానమును తెలిపి, తన భవబంధనమును తప్పించునని తాను నమ్మియుండెననియు, ఆతడు పోయినందున అది తనకు అసాధ్యమైనదను దుఃఖము గలదనియు ముక్తాయి అల్లమప్రభువుతో విన్నవించెను. "శివగణముల వారు ఒక్కొక్కరు ఒక్కొక్క కారణమున జనించి, తమ తమ పనులు దీరగానే మళ్లీ శివలోకప్రాప్తు లగుదురు; వారికి ఈ లోకపువ్యక్తులతో గాని ఈ లోకవ్యవహారముతోగాని సంబంధ ముండదు గనుక నీయన్న

1 ప్రభులింగలీల 89, 2 అదే పుట 91.

నిన్ను విడిచిపోయినాడను భావమును వదలి దుఃఖమును మాను"మని అల్లమప్రభువు ముక్తాయిని వోదార్చుచుపలికెను. అది విని ముక్తాయి "మా వంశమునబుట్టి, మము నెత్తి పెంచి, మావాడుగాడన్నమాట కర్థంబు దేవరకేగాని దెలియదు మాకు" *అని మారుత్తరము పలికెను.

అప్పుడు ముక్తాయికిని, అల్లమప్రభువునకు, ఆత్మానాత్మ, ద్వైతాద్వైత విషయముల గురించి గొప్ప వాదము జరిగెను అల్లమ ప్రభువు ముక్తాయి యొసగుచున్న ప్రత్యుత్తరములవలన ప్రభావితుండై, ఆమె మనసునందలి సంశయము నివారణమై అజ్ఞానము దూరమై, జ్ఞానోదయ మగునటులు అనుభావ జ్ఞానాచరణ క్రమమును మఱి యొకసారి వివర ముగా తెలిపెను. ముక్తాయి ప్రభువు తెలిపిన విధముగా సావధానముతో ఆచరించుచు అనుభావియై లింగైక్యమై బయలయ్యెను. ఈ ప్రకారముగా ముక్తాయికి ప్రభువు "శ్రేయఃప్రాప్తి నొసంగెనని" ప్రభు లింగలీల యందు వర్ణింపబడియున్నది. ముక్తాయి అల్లమ ప్రభువులమధ్య జరిగిన సంవాదము 'శూన్యసంపాదన' యందు 'ముక్తాయక్క సంపాదన'మను పేరుతో నొక ప్రత్యేక ప్రకరణము గలదు ఈ గ్రంథము వచన సాహిత్యమునందు అత్యంత శ్రేష్ఠమగు గ్రంథము. ఈ గ్రంథమునందు ముక్తాయక్క ప్రకరణ ముండుటవలన ఆమె శరణులోని ఉచ్చశ్రేణి యందలి శరణురాలనవచ్చును.

వ్యర్థముగా దినముల నెందుకు పోనిత్తురు ?
వ్యర్థముగా కాలహరణ మెందుల కొనర్తురు ?

---

* అదేపుట 91.

వ్యర్థముగా కాలహరణ మెందుకు జేయుదురు స్వాములారా ?
చేయుదుము రండు నిత్యనిత్య శివరాత్రి
వినెదము రండు శివానుభవగోష్ఠిని
చూతము రండు అజగన్న ఉనికిని బసవన్నతండ్రీ !

అంధునిచేయి అంధుడు బట్టినటు లుండవలయు,
మూగవానితో కావ్యము వినునటు లుండవలయు
దర్పణమందలి ప్రతిబింబమువలె పట్టుబడ నటులుండవలెగు
కూర్మము శిశువుస్నేహమువలె ఉండనొల్లక
ఆరూఢుడవైతివా ! అజగన్నా !

రవి యందలి ప్రతిబింబమువలె
పట్టుకొనువారికి చిక్కకుండవలెనన్నా !
నీయందున్ననన్ను భిన్నభేదములు చేయుదువా ఓఅన్నా !
నీ నుడువులన్నియు ప్రతిబింబములాయెగద ఓ అన్నా !
ఘటమందలి జ్యోతిని నిలుప
నరయనిదె వెడలి పోయితివా ! అజగన్నా !



# అద్దయక్కి లక్కమ్మ

అద్దయక్కి లక్కమ్మ మారయ్యగారి ఇల్లాలు. అద్దయక్కి మారయ్య సుప్రసిద్ధ శరణులలో నొకరు. 'శూన్య సంపాదన' యందు "మారయ సంపాదన" యను నొక విశిష్టమగు ప్రకరణము గలదు. ఏ వృత్తిని జేయక, పరావలంబిత జీవనము గడుపుటకూడదను శరణులు సిద్ధాంతము. మారయ్య కూడ నొక వృత్తిని చేపట్టి, ఆ వృత్తియందు తన దినావసరమునకు తగినంత సంపాదించుచుండెను. ఆ సంపాదనతో ప్రతినిత్యము గురు లింగ జంగమములను తృప్తిపరుచుచు, వారి ప్రసాదమువలన పతిపత్ను లిరువురును సంతృప్తి జెందుచుండిరి.

జనులకు ధాన్యముల (బియ్యమును) నుపయోగించునప్పుడు, క్రింద పడినవానినీ అట్లే విడుచుచుండుట, అలవాటు. ఆ అలవాటు అలక్ష్యము వలననో లేక అహంభావమువలననో,ఆనాడును నేడును గలదు. ఆధాన్యము వ్యర్థము గాకుండునటుల మారయ్య శ్రమతో తన నిత్యజీవనమునకు అవసరమున్నంత ధాన్యమును ఏరితీసుకొనివచ్చు కాయకమును (వృత్తిని) గైకొనెను. అట్లు ధాన్యములను ఎత్తుకొనివచ్చుటచే, ఆయన పేరు "అద్దయక్కి మారయ్య" అని ప్రసిద్ధిజెందెను. కన్నడభాషయందు 'అద్దయక్కి' అనగా 'ఏరితెచ్చిన బియ్య'మని యర్థము అతడు అట్లు గింజలను యెత్తుకొని వచ్చునప్పుడు సజ్జన సదాచారుల ఇండ్ల ముందట పరిపక్వ స్థలములందు పడిన గింజలనే యెత్తుకొనివచ్చుచుండెను.

మారయ్య 'కాయకమే కైలాస'మను భావన గలవాడు. అనగా 'కాయకము కైలాసపతియగు శివునిజేర్చు మార్గ'మని అతని భావము. కాయక మనగా సాధారణ భాషయందు "వృత్తి" అను అర్థమగును. కాని ఆనాటి శివశరణులు కాయక శబ్దమును నొకవిశిష్టమగు పవిత్రార్థమునందు వాడుచుండిరి. కాయకమునందు తాను జేయుచున్న శ్రమకుమించిన ప్రతి ఫలమును కోరకూడదనియు, శ్రమకన్న తక్కువకోరుట ఉత్తమమనియు వారి భావము అదియే చిత్తశుద్ధ కాయకమని వారి నిర్వచనము. కాయకమునందు ఉపలబ్ధమైన దానిని తమ ఉపభోగమునకు మాత్రమె ఉపయోగించుకొనక గురులింగ జంగమముల దాసోహమునకు ఉపయోగించి తత్ప్రసాదముతో సంతృప్తి బొందుచుండవలయునని వారి సిద్ధాంతము.

"కాయకమునందు నిరతుడై యున్నచో;
గురుదర్శనమైన మరువవలయును;
లింగపూజనైనను మరువవలయును;
జంగమామూర్తి ఎదురైనను విడువవలయును:
'కాయకమే కైలాసము': అమరేశ్వరలింగమైనను,
కాయకమునందుండవలయును"

అనునది మారయ్య ఖండితసిద్ధాంతము.

ఇట్లుండియు, అతడు ఒకరోజు శరణుల అనుభవగోష్ఠియందు మగ్నుండై కాయకసమయమును విస్మరించియుండెను. అప్పుడు మహాసాధ్వి లక్కమ్మ "నాథా! కాయకమునకు వేళఅయిన" దని,

"కాయకమునిలిచెను పోవయ్యా నన్నేలినవాడా,
భావశుద్ధితో మహాశరణుల వాకిట
పడిన తండులముల నొకపిడికెడు

దెచ్చి నిశ్చయించి జేయవలయును సేవ
మారయ్య ప్రియ అమరేశ్వర లింగమునకు
వేగిరముగ సొమ్ము మారయ్య తంద్రీ !''

అని మారయ్యను హెచ్చరించుచు అతనిని కాయకనిరతునిగా జేసెను. మరొకనాడు 'మహామందిరము' ముందర తండులము లెక్కువగా పడి యుండుటజూచి, మారయ్య ప్రతినిత్యము తెచ్చుచుండిన తండులములకన్న కొద్దిగ యెక్కువగా 'అన్నబసవన్న ప్రసాద'మని తెచ్చెను.

ఇంటికివచ్చి ఆ ధాన్యమును సుమ్మరించుచుండగా, అతిసూక్ష్మ గ్రాహియగు లక్కమ్మ చూచి, "ఈ రోజు ఎక్కువధాన్యమును తెచ్చి నారే! కారణమేమి? ఈ దురాశ నేడు మీకెందుకు గలిగె''నని మందలిం చెను. అంతేగాక పడుచుండిన గింజలను చేతితోఆపి.

"ఆశయనునది, భూమీపలకుగాని
శివభక్తుల కుండునా? అయ్యా ?
రోషమనునది యమదూతలకుగాని
గురుకరజాతుల కుండునా ? అయ్యా !
ఇన్ని గింజలపై ఆశ మాకేలగలిగె ?
శివుడు మెచ్చడు, దురాశను
మారయ్య ప్రియ అమరేశ్వర
లింగమునకు దూరమయ్యా !

"ఇన్ని తండులములు ఆశమీకెందుకు, అనుచు ఎక్కువతెచ్చిన గింజలను ఈశ్వరు డొప్పుకొనడు. మళ్లీగొనిపోయి తెచ్చినచోటనే పోసి రమ్మ"నెను. ఇది లక్కమ్మగారి సత్యనిష్ఠ, కాయకమునందలి పవిత్రభావ

ములను సూచించుచున్నది. సాధారణముగా భర్తలను దురాశలయందు అలవాటును గలుగజేయుటకు భార్యలే కారణభూతురాండ్రగు చుందురను నది సత్యదూరముగాదు. ప్రతి చిన్న పెద్దకుటుంబములలోని స్త్రీలు తమ తను ఇరుగుపొరుగు నందలి ధనికవర్గమువారు అనుభవించుచున్న భోగవిలాసములు, ధరించుచున్న భూషణాంబరములు తమకులేవుగదా, అనుచు, తమ తమ పురుషులను అవి తమకు తెచ్చిపెట్టుమని కోరుచు తమ సాంసారిక జీవనమును నరకముగా మార్చుచుండెడి సంఘటనలు నాడును, నేడును గలవు; ఇది స్త్రీజాతిపై నున్న అపోహ గాదు! అది వారి స్వభావ సిద్ధమగు కోరిక: కాని, ఇట్టి స్వభావమునకు విరుద్ధముగా, ఎక్కువ తెచ్చిన బియ్యమును రేపటి చింతలేకుండ "నల్లి ఎత్తుకొనిపోయి అచ్చటనే పోసి రమ్మనుట, లక్కమ్మయందుగల ఆదర్శ ప్రాయమగు సంతృప్తిభావమును, స్వయం సమృద్ధతను, ధీరతను తెలుపు చున్నది. ఇట్టి ఉచ్చమగు ఆదర్శ స్వభావము గలిగి తమ సాంసారిక జీవనమును ఆనందమయముగాను, పరమార్థ సాధకముగాను జేసుకొను పరమ సాధ్వీమతల్లులు నేడును లేక పోలేదు. ఐనను వారి సంఖ్య మిక్కిలి క్వాచిత్కము. అట్టి దంపతులు నిజముగా వంద్యులు-స్తుత్యులు.

తమ భర్తలు, తమ తమ శక్తి సామర్థ్యముల ననుసరించి జేయు చుండిన వృత్తుల వలనను చిత్తశుద్ధ మార్గముల వలనను గలుగుచుండెడి ప్రతిఫలమగు ఆదాయముతో సంతృప్త జీవనమును సాగించుచు, తమ జీవితములతోబాటు తమతమ భర్తల జీవితములను కూడ సత్యశుద్ధముగా జేయు భార్యలు నిజముగా ఆదర్శప్రాయులు. అట్టి సర్వోత్కృష్టమగు పవిత్రభావమునేడు మన స్త్రీజాతియందు గలిగిన, దేశమునందలి అనేక అవినీతులు ఎట్టిచట్టభీతిలేకనే, తమంతట తామే అంతరించి పోవుననిన అతిశయోక్తి గాదు.

పురుషులుకూడ తమతమ కర్తవ్యముల నాలోచించి, చిత్తశుద్ధితో మెలగిన, వారివృత్తి 'కాయక తత్త్వము'ననుసరించి, ప్రాపంచిక జీవనమును ఆనందమయముగా జేసుకొనుటయెందేగాక ఆధ్యాత్మిక సాధనయందును గూడ విజేతలగుదురనిన సత్యదూరముగాదు—

లక్కమ్మ వచనము :

1. మనశ్శుద్ధిలేని వానికి
ధనము కొరత బడును
చిత్తశుద్ధితో వృత్తి జేయు
సద్భక్తునకు, నలుమూలల యందు
లక్ష్మి తాండవమాడుచు కనుపించును
మారయ్యప్రియ అమరేశ్వర లింగమునకు
సేవజేయుచున్న
దాసురాలై యుండదా ఆ లక్ష్మి.

2. మనసున తొందరపడి కోరినందున
బసవన్న ప్రాంగణమునకు బోయి
అచ్చటపడివున్న తండులముల నన్ని
కట్టుకొని దెచ్చి గుమ్మరించుచుంటిరిగదా !
ఎప్పుడు తెచ్చెటన్నే చాలును మనకు
ఎక్కువ తెచ్చినవానిని గొనిపోయి
మరల అచ్చటనే పోసిరావయ్యా !
మారయ్యప్రియ, అమరేశ్వర లింగము
ఇచ్చిన కాయకమే చాలును మనకు.

3. ఒమ్మానకుమించి
ఇమ్మాన యెందుకు దెచ్చితిరి
ఇది నీ మనసో, లేక బసవన్నమనసో !
ఈ మాట మారయ్య ప్రియ
అమరేశ్వర లింగమునకు మెప్పుగాదు
వానినక్కడనే పోసిరావయ్యా
మారయ్యా !

4. భక్తులు కాయకలబ్ధమని
దాయాదుల ఆస్తినిదెచ్చి
దాసోహము జేయవచ్చునా, అయ్యా !
ఏకమనస్సుతో దెచ్చి, ఏకమనస్సుతో జేసి
మనస్సున భేదము కలుగకమున్నె
మారయ్య ప్రియ అమరేశ్వర లింగమునకు
అర్పించవలయును, మారయ్యా !

5. మొలకకు నీరుబోసిన
పల్లవించును గాని
మొదలెండిన చెట్టుకు నీరు బోసిన
అదిమరల పచ్చనగునా. మారయ్యా !
నీయందు విరక్తి తరుగక మున్నె
మారయ్యప్రియ అమరేశ్వర లింగము
నరయవయ్యా, తండ్రీ

6. గర్వముతో జేయుభక్తి ధనముచేటు
నడువజాలని నుడువులు జ్ఞానముచేటు

ఈయకనే త్యాగి యనిపించు కొనజూచుట
సిగలేనిస్త్రీ శృంగారము వోలె !
ధృఢములేని వాని భక్తి అడుగుపడిన
కుండలో జలమును నింపినటుల
మారయ్యప్రియ అమరేశ్వర లింగమునకు
మెప్పిదముగాని భక్తి వ్యర్థమయ్యా !

7. దేహమునకు పేదరికముగాని
మనసునకుండునా ?
గుండుపెద్దదైనను, సన్నదైన
ఉలిమొనతో పగులదా ?
ఘన శివభక్తులకు పేదరికముండదు
సత్యవంతులకు దుష్కర్మలుండవు
నాకు మారయ్యప్రియ అమరేశ్వర
లింగముండగా ఎవరిచింత
నాకెందుకు మారయ్యా !

8 దానధర్మములుజేసి కైలాసమునకు
పోయితిననిన, అదిప్రవేశరుసుమా !
ముందొకటి తలంచక, వెనుక నొకటి కల్పించక
కూడి పోయినచో
మారయ్య ప్రియ అమరేశ్వర లింగము
గలచోటు, అదెకైలాసము

# సోదరవాత్సల్యమూర్తి నాగమ్మ

నాకు పరమాన్నమును తినిపించినతల్లీ,
నాకు పరిణామమును కలిగించినతల్లీ
పరమ సుఖమునందున్న తల్లీ
పరవస్తువును నమ్మిన తల్లీ
బసవనిగురుమాతే !
సంగయ్య యందు స్వయం
లింగమైతివా, అక్కనాగమ్మ తల్లీ !

— నీలాంబిక

నాగమ్మకు (అక్కనాగమ్మ) నాగమాంబ యనియు నాగమాంబిక యనియు వేరు పేరులుగలవు. ఈమె బసవన్న సమకాలీనురాలు. ఈమె బసవన్నకు అక్కయని ప్రసిద్ధిజెందియున్నది. ఈమె కూడ బాగేవాడి (ఇంగుళేశ్వరము) నందలి శైవ బ్రాహ్మణ కుటుంబమునందు జనించి యుండును. ఈమె తల్లిదండ్రుల పేరులు తెలియవు. బహుశః ఈమె బసవన్నకు అక్కయగు వారియందు, వారి బంధువుల పుత్రికయై యుండును. సోమనాథుడు కూడ తన బసవపురాణమునందు ఈమె తల్లిదండ్రుల పేరులనుగాని, ఈమె జనన వృత్తాంతమునుగాని తెలుపలేదు. బసవన్న ఉపనయన సంస్కారమును నిరాకరించి, ఇల్లువిడిచి, కూడలి (కప్పడి) సంగమ క్షేత్రమునకు పోవునప్పుడు, అక్కనాగమ్మకూడ

చిన్నవయసునందే తన భవిష్యత్తును ఆలోచించక బసవన్న వెంబడి వెడలిపోయినట్లు తెలిపియున్నాడు

కూడల సంగమక్షేత్రమునందు ఈమె బసవన్నకు తోడునీడయై అతని సంరక్షణభారమును వహించి యుండినందున, ఈమెను బసవన్నకు అక్కయనియే తలంచుట సమంజసముగా నున్నది. శివశరణులయం దలి అన్నచెల్లెండ్ల ఆదర్శప్రాయమగు ప్రేమ, భక్తి అజగన్న-ముక్తాయక్కల యందు; అక్క - తమ్ముళ్ల ఆదర్శప్రాయమగు వాత్స ల్యత, అనురాగములను, నాగమ్మ-బసవన్నలందు గానవచ్చును. తనకన్న పెద్దవాడగు అన్నపై ప్రేమ, భక్తి తనను సంరక్షించునను అభి ప్రాయమువలన నుండుట సహజము. కాని తనకన్న చిన్నవాడగు తమ్ముని యందు అనురాగము వాత్సల్యతను కలిగియుండుట, అందులోను తన భవిష్యత్తును లెక్కించక, ఇల్లువెడలిపోవు తమ్ముని వెంబడి పోవుట: నాగమ్మ ఘనతను, త్యాగబుద్ధిని సూచించుచున్నది.

కూడల సంగమక్షేత్రమునందున్నప్పుడే నాగమ్మ, బసవన్నతో బాటు, సకలశాస్త్రముల నభ్యసించి, ఉచ్చతరగతి విద్యావంతురాలును, ఉత్తమతత్త్వజ్ఞానియును, అనుభావియును నైయుండెనని ఆమె వచన ముల వలన తెలియుచున్నది.

అక్కనాగమ్మ జీవితమునందు ఆమె కుమారుడు చెన్నబసవన్న జననము ఒక దివ్యఘట్టము. కూడల సంగమ క్షేత్రమునందున్నప్పుడె ఆమె గురువు జాతవేదుని సమ్మతి ప్రకారము శివస్వామియను నొక సత్య శరణునితో ఆమె వివాహమైనట్లును, అక్కడనే వారిరువురికి చెన్నబసవన్న జనించెననియు కొందరి అభిప్రాయము, బసవేశ్వరుడు కళ్యాణమునకు

వచ్చిన తదుపరి అక్కనాగమ్మకు కక్కయ్యగారి మహాప్రసాదాను భవమువలన, చెన్నబసవన్న జనించెనని మరికొందరి యభిప్రాయము. ఈ రెండభిప్రాయములతో కొంత కాలవ్యత్యాసము, శబ్దములయందు భేద ములున్నను, తాత్త్వికముగా ఈ రెండును నొక్కటియే యనవచ్చును. సాంసారిక జీవనము గడుపు దంపతులకు సంతానాపేక్ష గలుగుట సహ జమే! ఆ అపేక్ష గలిగిన హర గురు చరమూర్తుల ప్రసాదానుభవమును బొందుటయును సాంప్రదాయ సిద్ధమే! గనుక ఇంతవరకు సహజముగానే నున్నదనవచ్చును.

చెన్నబసవన్న ఆర్జించిన షట్స్థలజ్ఞానము, మహోన్నత పాండి త్యము, సాహిత్య నైపుణ్యము మొదలగు సర్వోత్కృష్టములగు గుణము లను జూచి, అతనిని ప్రసాదజీవిగాను, మానవాతీతవ్యక్తిగాను వర్ణించుచు అతడు అయోనిజునిగా కొందరు కవులు, భక్తిపారవశ్యమున తమతమ కావ్యములందు చిత్రించిరి. అందుకు శివస్వామి మౌనప్రతిభ, ప్రచ్ఛన్న జీవనములు కొంత తోడైనందున, అక్కనాగమ్మకు కక్కయ గారి ప్రసాదమువలన బుట్టిన చెన్నబసవన్న అయోని సంభూతుండనియు, పురాణమందలి కథ ప్రసిద్ధి యయ్యెను. సోమనాథుడు తన బసవపురా ణమునందు అక్కనాగమ్మ వివాహము గురించియును, చెన్నబసవన్న జననము గురించియును యెట్టి వివరములను తెలుపక, చెన్నబసవన్న బసవన్నకు మేనల్లుడను వావిని మాత్రము తెలుపుచు ప్రకరణమును ప్రారంభించినాడు.

ఐతిహాసికయుగమునందలి ఐతిహాసిక పురుషులను అయోని సంభవులనిన, ఆ వ్యక్తుల అస్తిత్వమునకే లోటుగలుగును. అంతే

గాక స్వయముగా బసవన్నయే "కర్ణములనుండి జనించినవారు గలరా?"* అని తన వచనములందు నుడువుటవలన, చెన్నబసవన్న జననము నైసర్గిక మార్గమునందు జరిగినదనియు, అతడు నాగమ్మ - శివస్వాముల ఔరసపుత్రుండనియు తలంచుటయే సమంజసము - సహజము.

బసవేశ్వరుడు కూడల సంగమక్షేత్రమునుండి కల్యాణమునకు పోయియున్నపుడు అక్కనాగమ్మ అతనికి అత్యంత సమర్థతతో సర్వ విధములైన సలహాల నొసగుచు, అతనికి అండదండగా నుండినది. ఆమె కల్యాణము నందున్నప్పుడు ముఖ్యముగా చెన్నబసవన్నజననము తదుపరి ఆమెబాధ్యతలు ఇనుమడించినవి. వానినన్నింటిని ఆమె అత్యంత కుశాగ్రబుద్ధితో నిర్వహించుచుండెను. కల్యాణమునందు చెలరేగిన రక్తపాతమునకు విసుగుజెంది బసవేశ్వరుడు తిరిగి కూడల సంగమ క్షేత్రమునకు పోవునపుడు, అక్కనాగమ్మ బసవేశ్వరుని వెంబడిపోక, భర్తశుశ్రూష, పుత్రుని సంరక్షణల బాధ్యతలను నిర్వహించుటకు కల్యాణము నందే నిలిచెను.

ఐనను ఆ సంఘటలవలన శరణులు చెల్లాచెదరై పోవునప్పుడు తన కొడుకు, చెన్నబసవేశ్వరుని వెంబడుపోవుచుండిన గుంపును అనుసరించి వారివెంబడి వుళివియను గ్రామమునకు పోయెను. అక్కడ ఆమె వీరశైవధర్మ రక్షణమునకుగాను విరోధుల నెదుర్కొనుటయందు తన కొడుకునకు సహాయకారిగా నుండెను. చెన్నబసవేశ్వరుడు లింగైక్యమైన తదుపరి ఆమె తుంగభద్రానదుల మధ్యప్రదేశమున లింగైక్య మొందినదను ఐతిహ్యము గలదు.

---

*బసవేశ్వరుని వచనము-సంఖ్య

ఇంగుళేశ్వర గ్రామము సమీపమునందలి గుట్టపైన 'అక్కనాగమ్మ బిలమ'ను పేరుతో నొక బిలముగలదు. అందు ఆమె ప్రతిమయొకటి గలదు. జనులు నేడును ఆ ప్రతిమను భక్తితో పూజింతురు. కల్యాణము నందలి త్రిపురాంతక చెరువు ప్రక్కనగూడ ఆమెపేరుతో నొక విశాలమగు బిలముగలదు. ఆమె సుహాతపస్వియై అక్కడవున్నప్పుడా బిలములందు శివయోగమగ్నయై యుండెనని తెలియవచ్చును. బెల్గాముజిల్లా యందలి నాగలాపురమునందు రెండడుగుల ఎత్తుగల ఆమెదొక మూర్తి గలదు. దాని ప్రక్కనసే చెన్నబసవేశ్వరుని మూర్తియును, రుద్రముని దేవస్థానముగూడ అచటగలదట.

ఈ విషయములన్నియు. ఆనాటి శివశరణురాండ్రయందు, అక్కనాగమ్మ ఉచ్చశ్రేణికి చెందిన శివశరణురాలని తెలియజేయుచున్నది. వచన సాహిత్యమునందు ఆమెవచనములు ఉన్నత స్థాయివని యెంచబడుచున్నవి.

అక్కనాగమ్మ బసవన్న చేయుచుండిన నిత్య గణార్చనలను, శరణులరాకడను, వారు సంతృప్తి చెందుటను అనుభవమంటపమునందలి భవ్యమగు శివానుభవ గోష్ఠులను విని, అందులో పాలుగొని, అనుభావమును పొంది, సంబరపడినది. బసవన్న కల్యాణమును విడిచి, రెండవ సారి కూడలసంగమ క్షేత్రమునకు పోయినపుడు, ఆమె కల్యాణమునందే ఉండి ఆ పరిస్థితిని చూచి మనసునందు ఆవేదన నుప్పొంగుచుండగా హృదయవిదారక మగునటులు వచించిన వచనము గమనించ దగియున్నది.

వచనములు :

1. శ్రీ గురువే తల్లిదండ్రులై, లింగమే పతియై
జంగమమే అత్తమామలై, శివభక్తులే బంధువులై
సత్య సదాచారమను ఇంటికి నన్నప్పగించిరి గాన;
శరణసతి—లింగపతియను పేరు నిజమయ్యెను
అటులే ఉండెద, వెనుక ముందాడక నడిచెద
మనసుకు మనసేసాక్షి యుండునటుల జేసెద
బసవప్రియ చెన్నసంగయ్యా మీ అడుగులకు

2. మనసున కొదయదగు మహాదేవుడు
మనసును పరీక్షించుటకు గాను
మనుజులతో ఒకటొకటి పలికించుచుండును
ఇందులకు ఓ మనసా కలవరపడకుము
ఓ తనువా భయపడకుము
నిజమును మరువక యుండుము
నిశ్చింతుడవై యుండుమో మనసా
బసవన్న ప్రియ చెన్నసంగయ్య
గుట్టంతయపరాధమైనను
చిటికెన వేలుతో తొలగించుము

3 నా తనువు చెన్నబసవన్నగారి, బయలు నందు గలిసెను
నా మనసు సంగన బసవన్న, నిజపదమునందు గలిసెను
నా ప్రాణము ప్రభుదేవుని, జ్ఞానమునందు గలిసెను

ఇటు లీముగ్గురు ఒక్కొక్కటిని పంచుకొనినంచుకు
నాదేమియు లేదిక, బసవన్నప్రియ చెన్నసంగయ్య
హృదయ కమలమందు నిజవాసియైతిని.

4 *బసవన్నా! నీవు మర్త్యలోకమునకు వచ్చినిలిచిన
భక్తిపెంపు దిశదిశల కెల్ల ప్రసరించెను
అయ్యా, స్వర్గ మర్త్య పాతాళముల యందెల్ల మీ
భక్తిపెంపు ఘనత నెవ రెరింగిరి?
అన్నా శశిధరుడు చెప్పి పంపినపని
పూర్తి యైనదని నీవు లింగైక్య మయిన
నీవెంబడే భక్తి పోయెనయ్యా!
నీవెంబడే సదాచారము పోయెనయ్యా!
నీవెంబడె అసంఖ్యాకులగు మహాశరణులు పోయిరన్నా!
మర్త్య లోకమునందలి మహామందిరము
శూన్యమాయె గద బసవన్నా!
నన్నుగొని పోవకనే పోయితిని గద
మహాపురుషమూర్తి బసవన్నా!
బసవన్నప్రియ చెన్నసంగయ్యకు
ప్రాణలింగమై పోతివా సంగబసవన్నా!

5 బసవడె నాముఖ సజ్జిక బసవడె నా ముద్దులమూట
బసవని నేనెత్తి ముద్దాడితిని
బసవా సంగన బసవదేవా జయతు
బసవా సంగన బసవలింగా జయతు.

బసవనికి నాకును భావభేదములేదు
బసవనికి నాకు రాసికూటము గలదు
బసవన్నప్రియ చెన్నసంగయ్యయందు
బసవని గనిన బాలెంతను నేను
బసవా, బసవా, బసవా !

6. భక్తి తపనిధివగు ఓ బసవన్నా
ముక్తి మూర్తియగు ఓ బసవన్నా
లింగజంగమముల, చైతన్యమగు నో బసవన్నా!
నిన్నువదలి నేనెట్లు సైరింతునయ్యా, బసవన్నా !
నా పరమగురువగు ఓబసవన్నా!
నా అంతరంగజ్యోతివగు నోబసవన్నా !
నీ ప్రసాదశేషము నిచ్చి, నన్ను పావన మొనరించి
బ్రతికించితివిగద ఓ బసవలింగా !
నాకు గతి మతి యింకెవరు, నీవుగాక ?
చెప్పవయ్యా, బసవన్నా
బసవన్న ప్రియ చెన్న సంగయ్యా
నీవు వదలిన నా ప్రాణము నిన్ను వదలగలదా బసవా!

—:o:—

# మాతృమూర్తి బెజ్జమహాదేవి

మాతృమూర్తి బెజ్జమహాదేవి బిజ్జావరమను గ్రామమునందలి శంకర భాగీరథులను దంపతుల సుపుత్రి. వీరునిష్ఠావంతులగు శివభక్తులు బిజ్జావర గ్రామము కర్ణాటక రాష్ట్రమునందలి తుముకూరుజిల్లాలో గలదు. ఈమెకు అమ్మవ్వ యనికూడ కన్నడసాహిత్యమునందు మరొక పేరుగలదు. అమ్మవ్వయందు తల్లిదండ్రుల శివభక్తి, సత్య సదాచారములు ప్రతీకమానమగుచుండెను. ఆమె తల్లిదండ్రుల పోషణయం దున్నప్పుడే భక్తి, దాసోహభావము, దయ, అనుభావజ్ఞానముల సంపన్న తను బొందెను. అమె బాల్యమునుండియే లౌకిక భోగములను దూర ముగా నుండుచుండెను.

ఆమెకు వివాహయోగ్యమగు వయస్సు రాగానే, ఆమెతల్లితండ్రులు ఆమె వివాహమును గురించి ఆలోచించు చుండిరి. ఈ సందర్భముననే అమ్మవ్వ మేనత్త కుమారుని వివాహప్రశంస కూడ వచ్చినందున, ఆమె తల్లిదండ్రులు, ఆమెను అపరిచితవ్యక్తితో వివాహ మొనరించుట కన్నను తమ బంధువర్గములోని వారితో వివాహ మొనరించుట అనుకూలముగా నుండునను, ఉద్దేశముతో అమ్మవ్వ సమ్మతిని విచారించకనె, ఆమెవివా హమును జరిపిరి. అమ్మవ్వ తనతల్లిదండ్రులను చుట్టపక్కములను కష్ట పెట్టుటకన్న తానే త్యాగమొనరించుట, ఉత్తమమని తలంచి తన భర్తవెంబడి అత్తవారింటికి వెళ్లెను.

ఆమె మనోభావమునకు వ్యతిరేకముగా వివాహము జరిగినందుననో లేక ఆమె భవిష్యజ్జీవితము త్యాగమయముగాను, పవిత్రముగాను, ఉండవలయునను శివసంకల్పమువలననో వివాహము జరిగిన నెలరోజుల లోనే ఆమెభర్త శివలోకప్రాప్తి జెందెను. ఈ వార్త ఆమెతల్లిదండ్రులను దుఃఖసాగరమున ముంచినను, అమ్మవ్వ శివప్రేరణయే ఈసంఘటనకు కారణమని తలంచి, దుఃఖమునకు బదులు, శివధ్యానము, శివచింతనము, గురుచరమూర్తులసేవల యందుండి 'శరణ' జీవితమును గడుపు చుండెను.

కొన్నాళ్ళకు ఆమెతల్లిదండ్రులుగూడ శివసాయుజ్యమును పొందిరి. అప్పుడు అమ్మవ్వ లౌకికముగా, నిరాశ్రితురాలయ్యెను. కాని, ఆమెనిశ్చల భక్తి, నిర్మలమనస్సు ఆమెను నిరాశ్రితగా తలంచనీయక శివాశ్రయము నందున్నటులు తలంపుచు, ఒంటరిగా జీవించుధైర్యమును కలుగజేసెను. ఆమె సద్గురువుతో లింగదీక్షనుబొంది, లింగధారియై పరిపూర్ణభక్తితో శివు నారాధించి, శివసాయుజ్యమును బొందుటకు అనుకూలము కలిగెనని, భావించి అట్లుచేయుచుండెను. శరణజీవితమునందైనను పరావలంబన మగుజీవనము, హేయమని తలంచి, ఆమె 'నూలువడకు' కాయక వృత్తిని అవలంబించెను. ఆవృత్తియందు వచ్చు ఆదాయముతో గురులింగ జంగమములకు ఆరోగణమును చేయించుచు, వారి ప్రసాదమువలనను జీవించుచు, తనపవిత్రజీవితమును సాగించుచుండెను.

ఇట్లుండగా నొకనాడు ఆవూరియందు జరుగుచుండిన పురాణ శ్రవణమునకు అమ్మవ్వ పోయెను. ఆ పురాణప్రవచనమునందు శివుడు స్వయంభువు డనియు (అనగా అతనికి తల్లిదండ్రులులేరని) అతడు సర్ప భూషణు డనియు, భస్మాంగు డనియు, భూతనాథుం డనియు, జటాధారుం

డనియు, నిటలాక్షుం డనియు, గరళకంఠుం డనియు, గంగాధరుం డనియు గజచర్మధారుం డనియు, వ్యాఘ్ర చర్మోత్తరీయుం డనియు ఇటులే అనేక విధములుగా వర్ణించిరి. ఈవర్ణనను వినిన ముగ్ధభక్తురాలగు అమ్మవ్వ తన ఆరాధ్యదైవమునకు ఇట్టిఇక్కట్టులు గలవా అనుచు మిక్కిలి చింతించెను. తన తల్లిదండ్రులు, శివలోకప్రాప్తు లగుటవలన తానుపడిన అనేక కడగండ్లు జ్ఞాపకమునకువచ్చి తల్లి లేనందునకదా శివుడు ఇట్టి యిడుమలను పొందుచుండుటకు కారణమైనదని తలంచి తాను శివునకు తల్లియై తల్లిలేని కొరతనుదీర్చి అతనిని అత్యంతగారాబముతో పెంచ కొందునని తపించుచు నిదురించెను.

ఆమెకు నిద్దురపట్టగానే శివుడు కలయందు కనిపించి, "నీమాతృ వాత్సల్యతకు ప్రసన్నతచెందితిని, నీకు మాతృప్రేమనుజూపు అవకాశము నిచ్చి నీమాతృప్రేమను పొందుటకుగాను ఈవూరిప్రక్కలో కొంత దూరముననున్న శివాలయమందు నేనొక శిశువుగా నుందును. రేపు ఉదయమున నన్ను నీయింటికి గొని వచ్చి పుత్రప్రేమతో నన్ను పెంచు" మనుచు శివుడు అంతర్ధాన మయ్యెను. తెల్లవారగానె, అమ్మవ్వ అదేప్రకారము ఆ శివాలయము నందొక శిశువును, ఆశిశువు ముఖమునందున్న దివ్యతేజమును చూచి హర్షముతో తన ఇంటికి తెచ్చుకొనెను. ఆమె మాతృప్రేమకు చిహ్నముగా ఆమె స్తనములందు పా లుబికెను. ఆమె ఆ శిశువును తన కన్నబిడ్డవలె అతిగారాబముతో పెంచుచుండెను. కొన్నాళ్లకు, ఆ శిశువునకు జబ్బుకలిగెను. అమ్మవ్వ వూరియందలి వైద్యులచే చికిత్సలు జేయించెను, కాని ఆ జబ్బు కుదురలేదు. అంతేగాక వైద్యు లందరును "ఈ శిశువు బ్రతుకు ఆశలే"దని తెలిపిరి. అది విని అమ్మవ్వ, ఈ శిశువు మృత్యువును జూచి దుఃఖించుటకన్న మొదలే తాను ప్రాణత్యాగ మొన

రించి; ఈ దుర్ఘటనను చూడనటులగుటయే మేలని, తలంచి ఖడ్గమును చేబూని తన తలను నరుకుకొన బోయెను.

అప్పుడు మొదట అమ్మవ్వకు కలలో కనిపించిన రూపమునందు శివుడు, ప్రత్యక్షమై "నీ మాతృభావమునకు, వాత్సల్యతకు నేను ప్రసన్నత జెందితిని. నిన్ను కైలాసమునకు గొనిపోయెద రమ్మ"నెను. అమ్మవ్వ అది విని, "నేను నా గురువాజ్ఞలేనిదే, నా నిత్యనేమములనువదలి రా" ననెను. "గురువాజ్ఞను పొంది కరస్థల మందలి ఇష్టలింగమునందు ఐక్యమై నీలో గలిసెద"నని తెలిపెను. అది విని శివుడు 'అట్లేఅగుగాక' అనుచు అంతర్థాన మయ్యెనని, పురాణములయందు ఆమెను గురించి తెలుపబడి యున్నది.

మహాకవి సోమనాథుడు తన బసవపురాణమునందు, తల్లిలేనందున శివుడు పొందిన ఇడుమలను, తల్లియై ఆమె శివుని పోషించిన శివ పోషణ వివరమును, బహుహృద్యముగా వర్ణించియున్నాడు. అందలి భావమును పాఠకులకు తెలియునట్లు ఆభాగమును క్రింద కూర్చి యున్నాను.

"ఎల్ల నియోగంబు లెల్ల బాంధవులు
నెల్లవారలు గల్గ నిట్లు భర్గునకుఁ
దల్లి లేకుండుట దా విచిత్రంబు
తల్లి లేకది యెట్లు దా నుదయించె ?
తల్లి సచ్చెనో కాక త్రైలోక్యపతికిఁ
జెల్లరో ? [illegible] ?

తల్లి సచ్చినఁగాదె తాను డస్సితిని
యెల్లవారికి దుఃఖ మిట్టిద కాదే !
తల్లి గల్గిన నేల తపసి గానిచ్చుఁ ?
తల్లి గల్గిన నేల తల జడ ల్గట్టుఁ ?
దల్లి యున్న విషంబుఁ ద్రావ నే లిచ్చుఁ ?
దల్లియుండినఁ దోళ్ల దాల్ప నే లిచ్చుఁ ?
దల్లి పాముల నేల ధరియింప నిచ్చుఁ ?
తల్లి బూడిద యేల తాఁ బూయ నిచ్చు ?
దల్లి వుచ్చునే భువిఁ దనయునిఁ దిరియ ?
దల్లి వుచ్చునే సుతు వల్లకాటికినిఁ
దల్లి లేకుండిన తసయుండుగాన
ప్రల్లదుఁడై యిన్నివాట్లకువచ్చెఁ !
జన్నిచి పలుమారు వెన్నయుఁ బెట్టి
పన్నుగా సిన్నియుఁ బాలును బోసి
యాకొనఁగాఁ గడు పరసి పాలిచ్చి
సాకించి పెనుపదే జనని గల్గినను
దానింత వాఁడయ్యెఁ దల్లి లేకయును
దానెంత పెరుగునో తల్లి గల్గినను ?
బెండిండ్ల నోములఁ బేరంటములను
బండువుదినములఁ బాటి జాతరలఁ
దగిన పోడిమి నేయు తల్లిలేకున్న
వగవరే మఱి యెట్టి మగబిడ్డలైన
నూర కుపేక్షించి యుండంగఁదగునె ?"

తల్లి లేనందున శివుడు యిన్ని యిడుమలు బడుచున్నాడని తలంచి, తానుతల్లి యై ఈ విధముగా పోషింతుగాననెను.

"యూరంగఁ దల్లినై హరుని నేనైన
నరసెదఁగాక, యి ట్లఁలేక పెనుచు
తరుణియి కాదెట్లు దల్లిదాననుచు !
ననయంబు బెజ్జమహాదేవి దాన
జననియై పరమేశుఁ దనయుఁ గావించి
తొంగిళ్లపై నిడి లింగమూ ర్తికిని
నంగన గావించు నభ్యంజనంబు
ముక్కొక్కుఁ జేక్కొ.త్తు ముక్కున్న బులుము
నక్కొక్కు గడుపొత్తు నడపీపు నివురుఁ
జెరుఁగఁగవలెనని తరుణి వీడ్వఁడఁగ
జరణము ల్కరములుఁ జాగంగఁ దిగుచు
నలుగులు నలుచు నర్మిలి గట్టిపెట్టి
జలములు వీఁపునఁ జఱచు నంతంత
వెగచి బెగడకుండ వెన్నుఁ వేయుచును
నొగి మస్తకమున నీరొత్తు దోయిటను
వదనంబు సొచ్చునో యుదకంబు లనుచు
నదుము బొట్టను నోరి కడ్డంబుపట్టుఁ
జెన్నుగాఁ బసుపార్చి చేయు మజ్జనముఁ
గన్నులుఁ జెవులును గాఁడంగ నూఁదు
నంగిటము ల్లొత్తు నందంద వేల
దొంగిళ్లఁ గార్నీరు దోనె త్తి మడుచు
బడఁత్రిచే నీర ద్రూపొడిచి బొట్టిడును

మడఁది యింగుష్ఠంబు మన్నింత మెదిచి
కడవ నంటినయట్టి పిడుకవిభూతి
యపరఁ బుత్తుర్తిని నొసలారంగఁ బూయు
నెత్తు గ్రుంగెడునని యెత్తంగ వెఱచి
యత్తన్వి రొమ్ముగ్రమ్మ సక్కన నదుము
కాటుక నిడ నింతగన్నగు నసుచుఁ
గాటుక యిడు మూఁడు గన్నులు గలయఁ
జన్నిచ్చుఁ బక్షుఁ జనసీదు మీఁద
నన్నాతి గొండొక పెన్నయుఁ బెట్టుఁ
జెక్కిలి గీఁటుడుఁ జెలఁగి యేత్వంగ
నొక్కవే లిడి పోయు నొకకొన్ని పాలు
ఉగ్గులు వోసియు నువిద సంప్రీతి
నగ్గించు నొగియించు నట బుజ్జగించు
ముద్దాడు నగియించు ముద్దులువేడు
నద్దికొక వీరెవ్వరయ్యరో యనుచుఁ
బన్నుగా నుదరంబు బాన్పుగాఁ జేసి
కున్న డో సలచుచు సన్నుతిబాడు"

ఆమె ముగ్ధభక్తి పవిత్రచరిత్రల స్మారకముగా సోమనాథుడు ఆమె పేరును గణసహస్ర నామావళి యందుచేర్చినాడు. పురాతన ముగ్ధ భక్తురాంధ్ర త్రిపది (కన్నడము) యందు కూడ ఆమె పేరు గానవచ్చును.

---

బసవపురాణము. 3-152-155 పుటలు పరిష్కర్త. లిం. బండారు తమ్మయ్య (1966).

—:o:—

# నిర్మలచారిత్రి నీలాంబిక

నీలాంబిక బసవేశ్వరుని భార్య. ఈమెకు నీలలోచన యని కూడ మరొక పేరు. ఈమె తలిదండ్రుల పేరులు తెలియవు కొందరు ఈమె బిజ్జలుని ఆర్థికమంత్రియగు సిద్ధన్న కూతురని అందురు. సిద్ధన్నగారు బసవేశ్వరుని గణితశాస్త్ర ప్రావీణ్యమును మెచ్చుకొని, అతని సౌజన్యము, సత్యనిష్ఠలచే ప్రభావితుండై, అతనిని తన అంక-గణితశాఖయందు ముఖ్యాధికారిగా నియమించుమని బిజ్జలునకు విన్నవించి, అతనికి ఉద్యోగ మిప్పించెను. అంతేగాక తనకు మగబిడ్డలు లేనందున, బసవేశ్వరుని తన ఆస్తికిని, రాజకార్యస్థానమునకును ఉత్తరాధికారిగా నియమించుమని బిజ్జలుని కోరెను. బిజ్జలుడు అదే ప్రకారము సిద్ధన్న నిర్వహించుచుండిన విత్తమంత్రి పదవిపై అతని అనంతరము బసవేశ్వరుని నియమించి రాజ భాండాగారమును అతనికి స్వాధీన పరచెను.

నీలాంబిక బసవేశ్వరునకు తగిన ధార్మిక ప్రవృత్తి, దానశీలత, రాజకీయ పరిజ్ఞానము గలిగి యుండి అతనికి సర్వతః సహచకారిణిగా నుండెను. హరిహరుడు తన 'బసవరాజ దేవర రగళె' యందు 'మాయాదేవి', అని తెలిపినవ్యక్తి తర్వాత జరిగిన సంగతుల ననుసరించి, ఆమెయే నీలాంబికయని గ్రహించవచ్చును. హరిహరుని కథానుసారముగా ఈమె బసవేశ్వరుని రెండవ భార్యయగు గంగాంబికతోబాటు, అతని దాసోహకార్యములయందు అన్నివిధముల సహాయకారిగా నుండినది. అనుభవమంటపమందు, అనుభవగోష్ఠులయందును సమభాగినియై

యుండెను. ఈమెకు "సిద్ధరస" అను నొకపుత్రుడు గలిగి శైశవదశ యందే శివసాయుజ్యమును పొందెనని తెలియుచున్నది. ఈమె జీవితము నందలి ముఖ్యములగు మూడు ఘట్టములు ఈమెను ఆనాటి శివశరణురాం డ్రందరి యందును మిన్న యనిపించినవి.

ఒక భక్తుడు ఒక రాత్రి నీలాంబిక పరుండియున్న గదిలో ప్రవేశించి, ఆమె దేహముపైనున్న ఆభరణములను జూచి, ఆశించి వానిని లాగుకొన నారంభించెను. సూక్ష్మజ్ఞానియగు నీలాంబిక పరపురుషుని హస్తస్పర్శను గ్రహించి ఎవరో మ్రుచ్చిలి గావచ్చునని తలంచి 'దొంగ' అని అరచెను. ఆ శబ్దమును విని బసవేశ్వరుడు కోపోద్రేకముతో నీలాంబికను గద్దించెను. "ఆ వచ్చినది సంగయదేవు దని తలచి, అతడు అడుగగానే వస్తువుల నివ్వక, అతని చేతులకు నొప్పి కలిగించిన పరమ ఛాండాలీ! తొందరగా అతనికి కావలసిన తొడవుల నిచ్చివేయు"మని గర్జించెను. అది విన్న నీలాంబిక శాంతముతో, పతి యాజ్ఞను మన్నించి, తనపైనున్న నగల నన్నింటిని దీసి ఆవచ్చిన భక్తున కిచ్చివేసెను. ఆనాటినుండి ఆమె తన జీవితాంతమువరకు నిరాభరణయై యుండెను. ఇది ఆమె త్యాగశీలతను తెలుపుచున్నది.

బసవేశ్వరుడు, జంగమమూర్తులకు ధన కనక వస్తువాహ నములు అడుగగానె మారాడక నొసగి వారిని సంతుష్టి పరచు చుండెను. సంగమేశ్వరుడు అతని భక్తిని, దానప్రతిజ్ఞను పరీక్షింప దలచి, ఒకనాడు విటజంగమవేషముతో 'మహామందిరము' నందు ప్రవేశించెను. బసవేశ్వరుడు తన నియమప్రకారము ఆ వచ్చిన జంగమ మూర్తికి అర్ఘ్యపాద్యముల నిచ్చి, అర్చించి, ఆరోగణము చేయించెను. అతని ఆగమన విశేషములను విచారించెను. ఆ మాయాజంగముడు తనకు

అంగననేమము గలదనియు, ఆరాత్రి తనకొక సుందరాంగిని తెప్పించు మనియు కోరెను. బసవేశ్వరుడు పట్టణము నందలి వారాంగనలలోని సుందరాంగనను తోడ్తెమ్మని పరిచారకుని పంపెను.

ఆ పరిచారకుడు వారాంగనల వాడకు జని విచారించగా, సంగయ దేవుని మాయచే ఆనాడు వారాంగన లందరును తమతమ విటపురుషులతో కూడియుండినటులు తెలుసుకొనెను. అతడు ఈ సంగతి బసవేశ్వరునితో విన్నవించెను బసవేశ్వరుడు ఇది సంగని మాయయని తలంచి, అత్యంత సుందరాంగియగు నీలాంబికను పిలిపించి, "నీవు ఈరోజు ఈ జంగమ మూర్తికి శయ్యాసుఖము ననుభవింపజేయు"మనుచు, ఆ జంగము దున్న గదిలోనికి పంపి తలుపు వేసెను.

ఆ ఘట్టము నీలాంబిక పాతివ్రత్య పరీక్షా ఘట్టము. ఆమె పతికి మారాడక, "బసవప్రియ! కూడల సంగమదేవా! నీవే నన్ను గాపాడు" మని హృదయాంతర్గతమున అనన్యవిశ్వాసముతో ప్రార్థించెను. అప్పుడు పరీక్షించుటకని వచ్చిన సంగయదేవుడు పరాజితుండై తన నిజరూప మును జూపెను. అంత నీలాంబిక "ఆ వచ్చిన జంగముడు సంగయ దేవుడైనా"డని తెలిపెను 'ఔనౌను. నేనది మొదలే గ్రహించితిని. పరీక్షించుటకని వచ్చిన సంగయదేవుడు తానే పరాజితుండయ్యె'నని బసవేశ్వరుడు అనెను.

ఆరోజునుండి బసవేశ్వరుడు, నీలాంబికయందు పత్నిభావమును మాని, పూజ్యభావముతో ఆమెను గౌరవించుచుండెను. ఈ సంఘటన వలన, అమెజీవిత లక్ష్యమునందు పరివర్తనము గలిగి, ఆమె శివ యోగినియై, లింగాంగ సామరస్యానుభావియై, మహాలింగసంగియై యుండె ననునది; ఆమె లింగైక్య సంఘటన, ఆ సమయమునందు ఆమె వచించిన వచనములు తెలుపుచున్నవి.

బసవేశ్వరుడు కల్యాణమునందలి రక్తపాతమునకు విసిగి కూడల సంగమక్షేత్రమునకు బోయి, తనను లోగొనుమని సంగమేశ్వరుని ప్రార్థించుటకు పూర్వము, నీలాంబికను పిలుచుకొని రమ్మని తన అంతరంగిక శరణుడగు అప్పన్నను పంపెను. అప్పన్న నీలాంబిక దగ్గరకు పోయి, "బసవన్న కూడలసంగమదేవుని యందు ఐక్యమగుటకుగాను నిన్నక్కడికి పిలుచుకొని రమ్మన్నా"రని తెలిపెను. అంత లింగ పూజానిరతురాలై యున్న నీలాంబిక అదివిని, "నన్నక్కడికి రమ్మన్నారట! పరిణామమూర్తి బసవని రూపము, నాకరస్థలమందు ప్రకాశించిన పిదప సంగయ్య చింత నాకెందుకయ్యా. అప్పన్నా" అని అడిగెను. కరస్థల మందలి తన ఇష్టలింగమునందు దృష్టిని నిలిపి, "చూడు, చూడు, చూడు, చూడు, చూడు లింగయ్యా! చూడుము బసవయ్యగారాడిన ఆట"యనుచు, లింగమందైక్య మయ్యెను. ఇది ఆమె పరిపక్వ లింగానుసంధాన స్థితిని తెలుపుచున్నది. కనుకనే, ప్రభుదేవుడు "ఇష్టలింగము నెలవును, నీలాంబికయే యెఱుంగు"నని, అనుభవమంటపమునందు ఆమెను గురించి వచించి యుండెను.

నీలాంబిక ఉచ్చతరగతి విద్యావంతురాలనియు, సంపూర్ణ అనుభావజ్ఞానియు, శివతత్త్వవేత్త యనియు, ఆమె వచనములవలన తెలియు చున్నది. సోమనాథుడు తన బసవపురాణమునందు, ఆమె విషయమగు వివరములను తెలుపలేదు. కాని 'గణసహస్రనామావళి' యందు ఆమె పేరును కూడ కూర్చియున్నాడు.

1. అరయనిశబ్దమును
గురుతునకు తెచ్చెను బసవయ్య

ఆగురుతను
రెండుగా జేసెను బసవయ్య
ఆరెంటి నొక దానియందు వేధించి
సంగయందు స్వయం
లింగమాయెనయ్యా! బసవయ్యా !

2. నాకు లింగము నీవే బసవయ్యా !
నాకు అంగము నీవే బసవయ్యా !
నాకు ప్రాణము నీవే బసవయ్యా !
నాకు ప్రసాదము నీవే బసవయ్యా !
నాకు ప్రభావమూర్తివి నీవే బసవయ్యా !
నాకు సంగయ్యవును నీవే బసవయ్యా !

3. దట్టమగు అడవియందు
విడిచిపోయితివా బసవయ్యా !
వూరినడుమ నన్ను దిగవిడిచి
పోయితివా బసవయ్యా !
పుట్టుగొడ్డాలునకు
బిడ్డ నిచ్చితివిగద బసవయ్య
సంగయ్యయందు నీవెంతటి
మహిమవంతుడవయ్యా !

4. వడ్డించని వారల జూచిన
తృప్తియయ్యెను నాకు
కూటమితెలియని నరుని జూచిన

కామాతురత తగ్గిపోయెను నాకు
ఇదేమని అడుగకమునుపే, తానే యయ్యెను
సంగయ్య యందు శబ్దము ముగ్ధ మయ్యెను

5. పడతి యనరాదు నన్ను బసవన్నకు
పురుష డనరాదు నాకు బసవన్నను
ఉభయకులము నశించగా
శిశువును నేనైతిని బసవయ్యకు
శిశువు నాకయ్యెను బసవయ్య
ప్రమథులు పురాతనులు సాక్షకాగా
సంగయ్య జూపిన దివ్యమును మీరి
బసవయ్యయందు లీనమైతిని.

6. నేను నీదానను గానయ్యా
నేను అనిమిషయ్యదానను
నేను నీదానను గానయ్యా
నేను అజగన్న దానను
నేను నీదానను గానయ్యా
నేను ప్రభువు సంతతిదానను
నేను నీదానను గానయ్యా
నేను చెన్నయ్య మనుమరాలిని
నేను నీదానను గానయ్యా
నేను ప్రసాదుల ఇంటి పడుచుతొత్తును

నేను నేదానను గానయ్యా సంగయ్యా
నేను బసవయ్య ఇంటి తొత్తుబిడ్డను.

7. నేనెవరినీ చేరుదుననీ
చింతిల్లు టెందులకయ్యా !
నేనెవరిని పొందుదునని
భ్రమించు టెందులకయ్యా !
నేనెవరి ఉనికి నరయుదునని
ప్రలాపించు టెందులకయ్యా !
పరిణామమూర్తి బసవనిరూపు
నాకరస్థలమున వెలుగొందిన పిదప
సంగయ్యచింత నాకెందుకయ్యా ! అప్పణ్ణ !

8. నా కింకేమి గలదు ?
మా బసవయ్య ఐక్యమయ్యినపిదప
నాకు కాయములేదు;
ప్రాణము లేదు
నాకుహృదయపు చింత హరించెను
పరిణామ ప్రసాదినై తినయ్యా సంగయ్యా !



# దాసోహమూర్తి గంగాంబిక

గంగాంబిక బసవేశ్వరుని రెండవభార్య. ఈమె బలదేవుని పుత్రిక. హరిహరుడు తన 'బసవరాజ దేవర రగళె', యందు గంగాంబిక వివాహ మెపుడు జరిగినదను విషయమును స్పష్టముగా తెలుపలేదు గాని ఈమె అతని రెండవ భార్యయని తెలిపినాడు. మహాశివకవి పాల్కురికి సోమ నాథుడు, బసవేశ్వరుని రెండవవివాహవిషయమే ప్రస్తావించలేదు. బసవేశ్వరుని రెండువివాహములలో, ఏది మొదలైనది, ఏది తర్వాత నైనది నిక్కముగా తెలియదు. బలదేవమంత్రి బసవన్నకు మేనమామ. అతడు తన కుమార్తె గంగమాంబను, బసవన్న కూడల సంగమ క్షేత్రమునకు పోకముందె, అతని కిచ్చి వివాహ మొనరించెననియు. ఆమె కూడ బసవన్న నాగాంబికల వెంబడి కూడల సంగమక్షేత్రమునకు పోయినదని, సోమనాథుడు తెలిపినాడు. బసవేశ్వరున కిద్దరు భార్యలను నది మాత్రము బహుజనాంగీకృత విషయము.

గంగాంబికయును, బసవేశ్వరుని దాసోహ నియమమునందు, నిస్స్వార్థబుద్ధితో, నిరహంకారమనస్సుతో, చిత్తశుద్ధితో అన్నివిధముల అనుకూలమగు వ్యవస్థను చేయుటయందు నీలాంబికతో సమభాగినియై యుండెను. ఈమెకు "బాల సంగయ్య" అనునొక కుమారుడు జనించి నట్లును, ఆ బాలుడు పిన్నవయస్సునందే శివలోకప్రాప్తి జెందె ననియు తెలియుచున్నది.

గంగాంబికయు కూడ గొప్ప విద్వాంసురాలు—అనుభావి—తత్త్వ జ్ఞాని. ఈమె కూడ అనుభవమంటపమునందలి గోష్ఠులలో భాగము వహించుచుండెను. వచనములను రచించుచు తన అభిప్రాయమును వ్యక్త పరుచుచుండెను. ఈమె వచనములను "గంగాప్రియ! కూడల సంగమ దేవా"యను మకుటముతో వచించి యున్నది. ఈమె జీవితము నందలి ముఖ్యమగు ఘట్టముల వివరము లేవియును తెలియవు. ఐనను నీలాంబిక గంగాంబికల కిద్దరికి సంబంధించిన ఏక ఘట్టము బసవేశ్వరుని కుటుంబమునకే సంబంధించినది — బసవని జీవితచరిత్రయందు గలదు. బసవేశ్వరుని భక్తి, దాసోహము మొదలగు వానినిజూచి, పరమతస్థులు బసవన్నపై బిజ్జలునితో చాడీలు చెప్పిరి. బిజ్జ లుడు బసవన్నను పిలిపించి రాజ్యభండార "మంతయు మాశరణులకు ధారవోయుచుంటివి. ఇక నీమంత్రిపదవి చాలు"నని తీక్షణముగా పలి కెను. బసవన్న ఈ సందర్భము వచ్చునని ఊహించి ఎల్లప్పుడును తనవద్ద నుంచుకొనుచున్న పదవీ త్యాగపత్రమును బిజ్జలుని ముందుంచి, బిజ్జలుని మారుత్తరము నెదురు చూడకనే, మహామందిరమునకు తిరిగి పోయెను.

అచట గంగాంబిక, నీలాంబిక, అక్కనాగమ్మ, శివస్వామి, చెన్నబసవన్న మొదలుగాగల వారందరు యథాప్రకారము ఇష్టాగోష్టియం దుండిరి. బసవన్న మనసున ఆనందమున్నను ముఖమున కొంత చింతనుజూపుచు మహామందిరము నందు ప్రవేశించి జరిగిన వృత్తాంత మును వారలకు తెలిపి మొదట నీలాంబిక ముఖమును జూచెను. పతి అంతరంగము నెరుంగగలిగిన సూక్ష్మజ్ఞాని యగుటచే నీలాంబిక :

"నేడు నా సంతసపు సంపద నెంతని యందునమ్మా!
నాసుకృతపు సంపద నెంతని యందునమ్మా
బసవప్రియ కూడల సంగమదేవుడు కృపతో
తానే, తన చేతులతో ఈ రత్న
సంకెళ్లను విడిపించెనమ్మా"

అనుచు హర్షోన్ముఖియై పతి చూపునకు ఉత్తరమిచ్చెను. బసవన్న తర్వాత గంగాంబిక ముఖమును జూచెను. ఆమెయు అత్యంత ఉల్లాసముతో తనపతి పదచ్యుతు డయ్యెనను చింతను మనసున ఆవంత యైనను రానీయక "అంతయు సంగని కృపయే" యని తనత్యాగ బుద్ధిని తెలిపెను.

ఇట్టి ప్రవృత్తి భార్యలయందు గలుగుట మిక్కిలి అరుదు. "పతి తృప్తియే లింగమూర్తి తృప్తి''యని భావించిన సతీరత్నముల కిది వింత గాదు. సుఖభోగములు అస్థిరము లనియు, క్షణికములనియు నమ్మిన ఆదర్శ అక్కచెల్లెండ్లువారు, పతిభక్తిపరాయణలువారు. కనుకనే వారి జీవితములు నిత్యసత్యము లయ్యెను. వారు అమరజీవు లయినారు. సర్వ కాలములయందు వంద్యులు, స్తుత్యులునై యున్నారు.

1. ఇదేమో ఎత్తి కనుపించు మూర్తి
పువ్వుల గుంపులో కనుపించకపోయెను
ఇదేమో ఎత్తి కనుపించుమూర్తి
కరస్థలమందలి లింగమునై
కదలక కనుపించు చున్నది.
ఇట్టిమూర్తిని గాంచి

గంగాప్రియ ! కూడల సంగని శరణుని సతి
ధన్యురాలయ్యె చెన్న బసవన్నా !

2. మాయయ్యె మనసునందు
మాటలలో కనుపించుమూర్తి
చూచుచుండగనె బయలయ్యె గదా !
ఇది అల్లమప్రభుచేసిన ఆట
పోయినదే నిశ్చయమైనచో,
హృదయము కలవర పడుచుండె !
ఇట్టి బిడ్డపోయినను పోనటులే.
గంగాప్రియ ! కూడల సంగనిశరణురాలి
చన్నుగుడుచుటకు రావయ్యా, చెన్నబసవన్నా !

3. "ఆమె కొడుకు బాలసంగడు
నీ కొడుకు చెన్నలింగడు
అని చెప్పెను గదమ్మా నా యజమానుడు
ఫలములేని కొడుకు గల డామెకు
ఫలము లేదు కొడుకులేదు నాకు.
ఇదేమో దుఃఖమునిచ్చు తొందరగద
గంగాప్రియ కూడల సంగమదేవా !

4. సాంద్రముగా హరగణములకు, భక్తి చేయున దెపుడో
మాదలాంబికానందనుడు

సాంద్రముగా బిజ్జలుని రాజసభయందు
న్యాయమును చేకూర్చునదెప్పుడో,
షూదరసుసి మోహంపుసుతుడు
సాంద్రముగా లింగార్చన, లింగతృప్తి
చెందున దెప్పుడో !
గంగాప్రియ! కూడల చెన్నసంగని శరణుడు

5. ఒక పాడుభూమియందు పులివచ్చి
నా కోడెలేగను భక్షించెగదా !
పాడుపడినచోటునకు పులిపోదు
ఆ పులి పసిపాపను జూచి జననియయ్యె,
దీనినేమందు గంగాప్రియ
కూడల సంగమదేవా !

6. మడివాలన్న కెందుకు రాదమ్మా కరుణారసము.
మడివాలన్న కెందుకు రాదమ్మా శౌర్యరసము.
మడివాలన్న కెందుకు రాదమ్మా అద్భుతరసము.
మడివాలన్న కెందుకు రాదమ్మా
గంగాప్రియ కూడల సంగని శరణునకు
ప్రాణదాన రసము సిద్ధరామయ్యా !

—:o:—

# ఉరిలింగపెద్దిగారి పత్ని కాళవ్వ

ఉరిలింగకాళవ్వ, ఉరిలింగపెద్దిగారి ధర్మపత్ని, ఉరిలింగపెద్ది యును మరియు కాళవ్వయును, ఉరుతర శివభక్తాగ్రేసరులు, శివానుభావ జ్ఞానసంపన్నులు. వీరిరువురును తమతమ వచనములద్వారా తమతమ అనుభావజ్ఞానమును లోకమునకు వివరింపగలిగిన శివశరణులు. వీరు మహారాష్ట్రమునందలి నందవాడ (నాందేడు) నివాసులు.

కాళవ్వగారి పతి మహాశివశరణుండైనను, అతని జీవిత మందలి పూర్వార్థభాగము, దీనికి విరుద్ధముగానుండినది అప్పుడు అతడు క్రూరమగు చౌర్యవృత్తి వలననే తన జీవితమును సాగించుచుండెను. కాళవ్వ తన భర్తను దుష్టవృత్తిని వదలి సద్వృత్తి నవలంబించి జీవన మును సాగించమని హితమును తెలుపుచునేయుండెను. కాని ఆమె మాటలను, అతడు పెడచెవిని బెట్టి తనవృత్తియందే ప్రవృత్తుడై యుండెను.

ఒకనాడు రాత్రి వీరశైవధర్మోపదేశమును జేయుటకుగాను తన జీవితమునే అంకితముగా జేసిన అచంచల శివశరణుడు ఉరిలింగ దేవుడు (శివలెంకమంచన కుమారుడు) ఆ పురియందలి సూరయ్యయను భక్తునకు లింగదీక్షా సంస్కారమును జేయుచుండెను. పెద్దన్న ఆరాత్రి ఆ ఇంటికే కన్నము వేయుటకు వచ్చియుండెను. కాని ఆ యింటియందు దీపములు వెలుగుచుండుటను జూచి గంటలు మ్రోగుచుండుటను విని,

"ఆ యింటి యందందరును మేలుకొని 'ఏమోచేయుచున్నా'రని తలంచి; దానిని తెలుసుకొనుటకని ఆ యింటి కిటికీనుండి తొంగి చూచెను.

కాషాయవస్త్రములను భస్మరుద్రాక్షలచు ధరించుకొని గద్దెపై కూర్చుని యున్న ఉరిలింగదేవుడును, అతనిముందట మడివస్త్రముల కట్టుకొని, నమ్రభావముతో కూర్చుని యున్నసూరయ్యయును, ఆ కిటికీ నుండి పెద్దన్నకు కనిపించిరి. అచటజరుగుచున్న దీక్షా సంస్కారమును పూర్తియగువరకు చూచుచు నిలుచుండెను. ఉరిలింగదేవుడు సూరయ్యకు ఇష్టలింగధారణ మంత్రోపదేశ మొనరించెను. ఆ తరువాత ఇష్టలింగ ధారియగు భక్తుడు ఆచరించవలసిన సదాచారములను తెలిపి అట్లు ఆచరించిన జనన మరణములు రహితమగుననియు, శివసాయుజ్యము కలుగుననియు ఉరిలింగదేవుడు సూరయ్యకు తెలిపెను. ఆ దృశ్యము, ఆ ఉపదేశవాక్యములు పెద్దన్న మనస్సునందొక వింతపరిణామమును కలుగజేసెను. పెద్దన్న అప్పుడే క్రౌర్య చౌర్య వృత్తులను జేయనని శపథమును జేసి తనయింటికి పోయి సుఖముగా నిదురించెను.

మరునాడు పెద్దన్న తెల్లవారక మునుపే లేచి నిత్యకృత్యములను దీర్చుకొని, అడవికి పోయి కట్టెలను నరికి రెండు మోపులుకట్టి, ఒకటి ఉరిలింగదేవుని మఠము ముందలవైచి, రెండవదానిని విక్రయించి, ఆ వచ్చినమొత్తముతో ఆనాటిదినమును గడిపెను. ఇటులే ప్రతిరోజు ఒకమోపును మఠము ముందటవైచి రెండవదాని ఆదాయముతో తనజీవనమును గడుపుచుండెను. ఉరిలింగదేవుడు, తాను సూరయ్యకు లింగదీక్ష నొసగిన మరునాటినుండియు రోజొక కట్టెలమోపు మఠము ముందల పడుచుండుటను చూచి, ఆ మోపుల నెవరువేయుచున్నారో ? ఎందుకు వేయుచున్నారో? కనుగొనవలయునని తలంచి, ఒకనాడు అతడు వేచి

యుండి, పెద్దన్న తెచ్చివేయుట చూచెను. ఆమోపుల నత డెందులకు వేయుచున్నా డనియు ఆమోపుల ఖరీదు ఎంతనియు పెద్దన్నను విచారించెను.

"సూరయ్యకు ఉపదేశ మొనరించిన దృశ్యము చూచినందున అతని మనసునందు విలక్షణ పరిణామమైనదనియు ఆ రోజునుండి తాను తన చౌర్యవృత్తిని వదలి కాయకతత్త్వమననుసరించి కట్టెల నమ్మువృత్తిని గైకొని జీవించుచున్నాననియు, అందుకు గురుదక్షిణ రూపమున రోజున కొక మోపును సమర్పించుచున్నా"నని తెలుపుటయేగాక; "తనకును అటులనే ఇష్టలింగధారణ సంస్కార మొనరించి, జనన మరణరాహిత్యము, శివ సాయుజ్యము కలుగునటుల అనుగ్రహించు" మని, ఉరిలింగదేవుని పెద్దన్న వేడెను.

ఉరిలింగదేవుడు అతని మనస్సునందున్న నిశ్చలతను తెలుసుకొన వలయునని తలంచి "సరే శివాజ్ఞకాని" అనెను. "కట్టెలమోపును తెచ్చి వేసిన అభ్యంతరములేదు కాని దానివెలను తెలుపు"మనెను. "వెల నివ్వనిదే ఒకరిశ్రమను స్వీకరించుట శరణధర్మము గాద"నియును ఉరిలింగదేవుడు తెలిపెను.

పెద్దన్న తాను ఆమోపును గురువునకు అర్పితముగా తెచ్చివేయు చున్నందున దానిఖరీదును తానుగైకొను సమస్యయే రాదని విన్నవించెను. పెద్దన్న రోజునకొక మోపును మఠము ముందట వేయుచునే యుండెను. ఒకనాడు ఉరిలింగదేవునకు పెద్దన్నపై అంతఃకరణగలిగి, తనకరకమల ములందొక చిన్న గుండురాయిని గైకొని, బహిరంగమున కఠినముగా "ఫేధగడి జా"అని పలుకుచు పెద్దనవైపు విసిరెను. పెద్దన్న అత్యంత భక్తిభావముతో [illegible] అనుగ్రహి[illegible] లింగమును

ప్రసాదించినాడని తలంచి తన రెండు హస్తములతో దానిని గ్రహించి శిరస్సుపై నుంచుకొని గురువునోటినుండి వెడలిన శబ్దములను మంత్రాక్షరములని తలంచి వానినె మనసున మననము చేయుచు తనయింటికి పోయెను. ప్రతిరోజును పెద్దన్న ఆ లింగమును పూజించుచు, ఆ మంత్రమును జపించుచు లింగనిష్ఠయందుండి శివానుభావ జ్ఞానసంపన్నుడయ్యెను తన అను భావవచనములను వచించెను. అతని వచనములు కన్నడవచనవాఙ్మయమునందు సుప్రసిద్ధములు. కాళవ్వయును తనభర్త చేయుచున్న ఇష్టలింగపూజ మంత్రజపమును చూచి అతనితో జ్ఞానోపదేశమును బొంది ఆమెకూడ గొప్ప శివశరణు రాలయ్యెను. వీరిరువురి పేరులను మహాకవి సోమనాథుడు తన 'గణసహస్రమాలిక' యందు చేర్చి వారి ప్రాముఖ్యతను తెలిపియున్నాడు.

ఉరిలింగపెద్దియును వారి పత్ని కాళవ్వయును ఉచ్చశ్రేణి వచన కర్తులు. మచ్చునకుగాను కాళవ్వ గారి కొన్నివచనముల నిందు పొందు పరుచున్నాను.

1. వ్రితి మనునది నాయకరత్నము
వ్రిత మనునది ఆణిముత్యము
వ్రిత మనునది జీవనకళ
వ్రిత మనునది సువిధానము
వ్రితము తప్పిన, అరసు ఉరిలింగపెద్ది
వారి నొల్లదమ్మా !

2. తుమ్మ కొరివివలె మండువాడు భక్తుడా ?
అబద్ధాలాడి తెచ్చి దాసోహము
జేయువాడు భక్తుడా ?
భక్తుల కులమెంచి నిందించువాడు భక్తుడా?

"నిందయా శివభక్తానాం కోటిజన్మాని సూకరః,
సప్తజన్మ నికుష్ఠసన్ దాసీగర్భేషు జాయతే"
అనునట్లు, తన ప్రాణముపై వచ్చినను రానీ,
ఇట్టిదానిని విడువవలయు, విడువకున్న
అరసు ఉరిలింగపెద్ది, వానిని మెచ్చడమ్మా !

౩ కృత్య కాయకములేనివారు భక్తులా ?
సత్యశుద్ధములేనిది కాయకమా ?
ఆశయనునది భవమునకు బీజము
నిరాశయనునది, నిత్యమగు ముక్తి
అరసు ఉరిలింగపెద్ది
అట్టి వానిని వారిని మెచ్చడమ్మా !

4. వ్రతము జెడిన వెంటనే
ఇష్టలింగమందలి కళ, నష్టమగునమ్మా !
అట్టివారు లింగమున్నను భవులే !
వారు ప్రాణములేని దేహమువలె !
అరసు ఉరిలింగపెద్ది మెచ్చడమ్మా !

4. అర్థ ప్రాణాభిమానములపై వచ్చినను రానీ
వ్రతహీనుని కూడ రాదు:
చూచుట పలుకరించుట ఎన్నటికిని వలదు.
హరహరా, పాపవశమున జూచిన
రుద్రజపము మాహేశ్వరారాధనము జేయవలెగును
అరసు ఉరిలింగపెద్ది ఇట్టి వారిని
జూచి, నగి వెడలగొట్టునమ్మా!

# మహాదనుభావి లింగమ్మ

లింగమ్మ అడపద అప్పన్నగారిభార్య. వీరిరువురి పూరు కల్యాణము. చరిత్రయందు వీరిరువురి తల్లిదండ్రుల గురించిగాని, బాల్యదశల గురించిగాని వివరము లేమియును తెలియవు. ఐనను, వీరు బసవేశ్వరుని సమకాలీనులనియు శివానుభావులనియు, ఉచ్చశ్రేణి వచన కర్తలనియు వీరివచనముల వలన తెలియుచున్నది.

అప్పన్న శివానుభావియగు వచనకర్తయే గాక కాయకశీలుడనియు కూడ తెలియుచున్నది. ఈ దంపతు లిరువురును అనుభవమంటపము నందలి అనుభావగోష్ఠులలో పాలుగొనుచుండుటయేగాక బసవేశ్వరుని మహా మందిరమునందు బసవేశ్వరునకును, అతని కుటుంబవ్యక్తులకును అతి సన్నిహితముగా నుండెడివారనియు కూడ తెలియుచున్నది. బసవేశ్వరుడు రాజ్యకర్తవ్యములను పాలించుచున్నపుడును, అనుభవ మంటపమునందలి చర్చలయందు పాల్గొనుచున్నపుడును, గురులింగ జంగమ దాసోహకర్తవ్య ముల నొనరించుచున్నపుడును,పూజాధ్యానాదులందు నిమగ్నుడై యున్న ప్పుడును అప్పన్న బసవన్నకు సన్నిహితుండైయుండి అతని కనుసన్నల అనుకూలముగా మెలగుచుండెను. నేటిభాషయందు అప్పన్న బసవన్నకు ఆంతరంగిక కార్యదర్శిగా నుండెనని అనినను అనవచ్చును. కాని అతడు నిర్వహించుచుండిన బాధ్యత నేటి ఆంతరంగిక కార్యదర్శి నిర్వహించు చున్న బాధ్యతల కన్నను మీరి యుండెను. బసవేశ్వరుడు అప్పన్నగారికి అంతటి మహత్తరమగు కర్తవ్య బాధ్యతల నప్పగించి, తనకు అత్యంత సన్నిహితముగా నుండునట్లు నియమించుటకు; అప్పన్నయందలి అను

భాషాజ్ఞానము, కార్యదక్షత, ఎదుటివారి ఇంగిత మెరింగి సముచితముగా సంభాషించు ప్రతిభ కారణములన వచ్చును. ఇట్టి బాధ్యతలను అప్పన్న నిర్వహించుచున్నను, అతడు క్షౌర వృత్తి నవలంభించి ఆ వృత్తివలన లభించు ఆదాయమువలన తన నిత్యజీవనమును, త్రివిధ దాసోహ కర్తవ్యములను నెరవేర్చుచుండెను. ఇది శివశరణుల యందలి కాయకతత్త్వమును, వ్యక్తులయందు ఉచ్చనీచ తారతమ్యము లేదను వారి సిద్ధాంతమును తెలియజేయుచున్నది.

అప్పన్నగారి జీవితము నందలి రెండుఘట్టములు మిక్కిలి ప్రశంసనీయములు. అవి అప్పన్నగారి అనుభావప్రతిభను; ధర్మ తత్పరతను, ఉజ్జ్వలపరచుటయేగాక, బసవేశ్వరుని జీవితమునుకూడ ప్రకాశింప జేయ గలిగినవి.

'మహామందిరము' నకు వచ్చువారల యోగక్షేమములను తెలుసుకొని, వారి రాకను బసవన్నగారికి తెలియజేయుటయును బసవన్నగారి ఆజ్ఞానుసారము ఆ వచ్చువారికి స్వాగతముచెప్పి వారిని ఉచితాసనములందు విశ్రమింప జేయుటయుగూడ అప్పన్నగారి కర్తవ్యములలో నొకటియై యుండెను.

అల్లమప్రభువు సొన్నలిపురమందలి సిద్ధరామయకు అనుభావజ్ఞానమును తెలిసి కల్యాణమునందు జరుగుచున్న బసవన్న భక్తి ప్రభావములను, దాసోహకార్యములను అతనికి చూపించదలంచి; అతనిని కల్యాణనగరమునకు పిలుచుకొని వచ్చెను. అప్పుడు అల్లమ ప్రభువు, సిద్ధరామయ ఇద్దరును బసవన్నగారి మహామందిరము ముందు నిలిచిరి. మహాద్వారము ముద్ద నిలుచున్న [illegible] అప్పన్న అల్లమ

ప్రభువును జూచి "హరుఁడు సాకార నిరాకారతను వురహొప్ప ధరియించి బసవేశు వరభక్తి చూడఁగవచ్చె[1]"నని తలంచి నమస్కరించి ప్రమథగణ సమూహమందు లింగార్చన జేయుచున్న బసవన్నకు, అల్లమప్రభువు రాకను విన్నవించెను. అది విని బసవన్న తాను "హస్త బిసరుహంబునం బూజఁ బెద్దయుం గరుణఁ గైకొనవచ్చి జంగమరూపుదాల్చి, చేకొని నన్నరక్షింప విచ్చేసె"నని, దలంచి[2] 'వేగిరమే తోడ్కొని రమ్మని' అప్పన్నకు చెప్పి పంపెను.

అప్పన్న "శరణార్థి లోపలికి దయచేయుం"డని అల్లమప్రభువ నకు విన్నవించెను. అదివిని అల్లమప్రభువు "లోనేద! వెలియేద? లోకాను సారులైన దొరల యిండ్ల కరుగ మాకేల?"[3] అని నిష్ఠురోక్తులు పలికెను. అప్పుడు అప్పన్న అల్లమప్రభువుయొక్క ఇంగితము నెరింగి,

"మనసునందు మనసు ఏకమై
కాయమునకు కాయము సంబంధమై
ప్రాణమునకు ప్రాణము సమదర్శనమై,
యున్నవారియందు తెరమరుగులు నుండవు చూడయ్యా !
సంగము నిస్సంగమైయున్న వారియందు
ఉపచారమునకు తావుండదు చూడయ్యా !
బసవప్రియ ! కూడల చెన్నసంగని శరణుడు
పంపెను కృపజేయుము గురువే !"

అనుచు అప్పన్న బసవన్న యందలి శివాద్వైత భావమును అల్లమ ప్రభువునకు విన్నవించెను.

అప్పన్న వచనమందలి అద్వైతభావమునకు అల్లమప్రభువు సంతసింపక, "నేనుగాక మొదలే తానైతినను వారి వద్దకు, గుహేశ్వర

1. ప్రభులింగలీల పుట 110, 2. పుట 111, 3. పుట 111.

లింగము అడుగిడడు "అనుచు అల్లమప్రభువు నిర్మోగమోటముగా పలికెను. అప్పన్న అదివిని బసవేశ్వరుని దగ్గరకు వెళ్లి" కాయము భక్తుండైన భృత్యాచారము వలదా?" అనుచు ఆతనిని హెచ్చరించెను. "తన మందిరమునకు తాను వచ్చుటకు అనుమాన మేల"నని అల్లమ ప్రభువునకు తెలుపుచు, లోపలికి దయచేయమని తనమాటగా విన్నవించు మని బసవన్న మరల అప్పన్నను పంపెను.

బసవన్న మాటకు మారాడక అప్పన్న అల్లమప్రభువు కడకుజని,
"తనువు మీది, మనసు మీది, ధనము మీది.
మీది గానిది అతనిపద్ద అణుమాత్రము లేదు చూడయ్యా
భక్తుని మందిర మని తలంచివచ్చి మరల
అన్యథా తలంచెదరా స్వామి !
బసవప్రియ ! కూడల చెన్నసంగయ్యా శరణుడు
బసవన్నకు తనదను భావమున్న మీపాదమాన"

అనుచు బసవన్నగారి యందు లౌకికభావములేదని వివరించి విన్నవించెను.

అల్లమప్రభువు పరీక్ష మరింత తీక్షణ మయ్యెను. "అరభక్తు తో స్నేహము మాగు మేశ్వరలింగమునకు పొసగ"దని ఖండితముగా తెలి పెను.

అదివిని అప్పన్న తన అనుభావవచనములచే అల్లమప్రభువును మెప్పించి లోపలికి తోడ్కొని పోవుటకు బహువిధముల ప్రయత్నమొన రించెను. కాని, ప్రభుదేవుడు ఎంతకును కదలకుండుటను చూచి లోపలికిం జని, "దేవదేవా! ప్రభువు నామనవి విని లోపలికి వచ్చునట్లు లేడ"ని బసవేశ్వరునితో మనవి చేసుకొనెను.

"ప్రభువరుం డరుదెంచి లోపలికిరాక వెలుపలనే నిల్చె"[1]నని చింతాక్రాంతుడైయున్న బసవన్నను జూచి, తన్నుదానే అల్లమ దయ భక్త జనుల గనుగొని రక్షింపగా వచ్చుటెటింగియును, నీవెదుర్కొన కుడి గంపువానిఁ బనిచితివిది నీకు బసవన్నా' చెల్ల"దని అక్కడున్న మడివాల మాచయ్య బసవన్నకు తెలిపెను.

మరియు చెన్నబసవన్న కూడ అక్కడేయుండి

"సంగమనాథుండు సాంగముగ ఇంటికి వచ్చిన
దిగ్గునలేచి ఎదురేగి నమస్కరించ వలయును చూడవయ్యా !
కూడల చెన్నసంగని శరణులు
ప్రభుదేవుడు సిద్ధరామయదేవుడు
వాకిట నిలుచున్నది కన్నులకు
తెలియకున్నను ఆత్మకైనను
తెలియవలదా సంగన బసవా !"

అనుచు బసవన్నను హెచ్చరించెను.

ఇరువురి హితోక్తులను విని, బసవన్న "నేనే స్వయముగాపోక అప్పన్నను పంపి తప్పుజేసితి"నని చింతించుచు, గణసహితుండై అల్లముని కడకు జనుదెంచి, అతని పాదసరసిజములకు సాష్టాంగప్రణామంబు లొనరించి, "అపరాధమును క్షమించి, మందిరమునందు ప్రవేశింపు"మని ప్రార్థించెను.

ఈ సన్నివేశమునందు ప్రభుదేవుడు సంగమనాథుండని తెలుసుకొని బసవన్నకు తెలుపుటయందును, బసవన్న యందలి నైజమగు భక్తిభావమును, దాసోహకర్తవ్యములను ప్రభువున కెరింగించుటయందు పలికిన వచనములయందును అప్పన్నగారి ఘనత తెలియవచ్చుచున్నది.

---

1. ప్రభులింగలీల. పుట 111.

అప్పన్న బసవన్నకు చివరవరకును అంతరంగికుడుగా వర్తించు చున్నందున మరొక సన్నివేశము అతని జీవితమునందు, అతని నెదు ర్కొనినది ఆ సన్నివేశము బసవేశ్వరుడు కల్యాణమునందలి రక్త పాతమునకు విసుగుజెంది, దానిబాధ్యతను తాను అంగీకరించి, 'ఆత్మా ర్పణము' చేయదలంచి కూడల సంగమక్షేత్రమునకు పోయినపుడు కలిగినది. ఆ సమయమునందు అనేకప్రమథులు చెల్లాచెదరై పోవు నపుడు, నిర్మలచారిత్రి నీలాంబికదేవి, తన వెంబడిరాక అచ్చట నిలుచుం దుట బసవన్నకు జ్ఞాపకమునకొచ్చి, ఆమెను పిలుచుకొని వచ్చుటకు, బసవన్న, అప్పన్నను కల్యాణమునకు పొమ్మనెను.

అప్పన్నగారి జీవితమునం దిదొక దారుణమగు సన్నివేశము అప్పన్న బసవన్నగారి మాటను శిరసావహించి కల్యాణమునకుబోయి "బసవన్నగారు నిన్నుపిలుచుకొని రమ్మని పంపినారని నీలాంబికదేవికి దెలిపెను. ఈ సందర్భమున నీలాంబికదేవికిని అప్పన్నగారికిని జరిగిన సంభాషణమును,"నిర్మలచారిత్రి నీలాంబిక చరిత్ర"యందు తెలుప బడినది.

బసవేశ్వరునకు సన్నిహితము నందుండి "భ్రమరకీటకన్యాయము" వలె అప్పన్న ఆత్మజ్ఞాని, శివానుభావి, యైనటులే అతని పత్ని లింగమ్మ, మహామందిరము నందలి నీలాంబిక, గంగాంబిక, 'అక్కనా గమ్మ మొదలగు ఉజ్జ్వల శివశరణురాండ్రతో కూడియుండినందున,ఆమె కూడ సమ్యజ్ఞానియై ఆత్మవేద్యమగు విచారము, అనుభావజ్ఞానముతో కూడిన వచనములను వచింప గలిగినదనవచ్చును. ఆమె సహజ సుందరమగు బోధనవచనములు శివానుభావముయొక్క సూక్ష్మమగుతత్త్వ ములను వివరముగా వచింపగలిగినది.

ఆమె అల్లమప్రభువు, మడివాల మాచయ్య, చెన్నమల్లేశ్వరుడు మొదలగు మహాత్ముల మధ్య చరించుచుండినందువలనను, షట్స్థలచక్రవర్తి చెన్నబసవేశ్వరుడు ఆమెకు అనుగ్రహగురువైనందు వలనను ఆమె సంపూర్ణ అనుభావియై పరంజ్యోతి రూపమునందు శివానుభావ సాక్షాత్కారమునుపొందినటులు ఆమె వచనములవలన తెలియవచ్చుచున్నది.

ప్రాణ లింగస్థలమునకు సంబంధించిన లింగమ్మవచనములు చిన్నవిగా నున్నను, వజ్రములవలె ప్రకాశించుచున్నవని అనుభావులైన వారు ప్రశంశించియున్నారని,లింగమ్మ సాహిత్యమును గురించి సంశోధన మొనరించిన శ్రీ చ. సుందరేశన్, ఎం.ఏ., (సూసలే) గారు శరణ సాహిత్యము (కన్నడమాస) పత్రికయందు (15-1-1963)తమ వ్యాసమునందు తెలిపియున్నారు. అట్టి మహదనుభావియగు లింగమ్మగారి బోధనాత్మకమగు కొన్ని వచనముల అనువాదము క్రింద వ్రాయుచున్నాను—

1. పశ్చిమద్వారమును తెరిచి
బట్టబయలు నందలి వెలుతురును చూడనొల్లక
చీకటి తలుపును నెట్టి
కన్నుగానని అంధునివలె జారి మడుగునపడి
కర్మకు గురియగు మర్త్యలోకపు మనుజులారా !
మీరు వినుడోయి తెలిపెదను
మా శరణుల ఆచరణ యెట్టిదనిన
చీకటి తలుపును తెరువక
పశ్చిమద్వారమును తెరిచి
బట్టబయలునందలి వెలుతురులో

నోలలాడెడు శరణుల పాదములకు
నమో నమోయని సుఖినైతినయ్యా
అప్పన్న ప్రియ చెన్నబసన్నా !

2. మనసును నిర్మల మొనరించితినని తనువును కరిగించి
మనసును అలసటజేసి, కలవరపడి
కన్నులు గానని అంధునివలె ముందుగానక
సందేహమందు మునిగి యుండెడి మనుజులారా !
మీరు వినుడోయి తెలిపెదను
మనసును నిర్మలపరిచి, ఆ ఘనమును గాంచుటకు
ఆ మను సెటులుండ వలయుననిన
గాలి వీచనిజలమువలె, మబ్బులేని సూర్యునివలె
శుభ్రపరచిన దర్పణమువలె మనసు నిర్మలముగానిదే
ఆ మహాఘనము కనుపించదని
అనిరి మా అప్పన్నప్రియ చెన్నబసవన్న !

3. ఒడలి కండల పెంచక,
పరువులిడు మనసునరికట్టి
అంగగుణమును ద్రుంచి
లింగ గుణమును పెంచి
అహంభావమును మరిచి
కోరికల విరమించుకొని
మహాదేవుండైన మా శరణుని
మర్త్యలోకపు మానవు లెట్లు తెలియుదురు
అప్పన్నప్రియ ! చెన్నబసవన్నా !

4. మహాప్రకాశమును గాంచి,
మనసును మీ వశపరచి,
తనుగుణమును మరిచి.
ధనమును జంగమమున కర్పించి
తాను నిర్దేహియైననేగాని,
నిజముక్తి దొరకదని అనిరి
మా అప్పన్నప్రియ! చెన్నబసవన్న!

5 కాయమను కదళిని జొచ్చి
కొనకదళిని దాటి జీవుని శివుని నెలవుల దెలిసి,
జనన మరణముల గెలిచి
భవమును దాటినగాని
ఘనము కనుపించదనిరి
మా అప్పన్నప్రియ! చెన్నబసవన్న !

6. కదళివనమందలి లింగము
నరసిచూచిన కనుపించదు
చూచిన కంటికగపడదు
పట్టుకొనిన చేతికి దొరకదు
తలచిన మనసునకు తెలియదు
ఇట్టి మహాఘనమును హృదయమందు
నెలకొల్పిన శరణుల దృష్టియందు
రెప్పవాల్చక చూచి
వారిపాదములందు ఐక్యమైతినయ్యా
అప్పన్నప్రియ! చెన్నబసవన్నా !

7. ఈ పరంజ్యోతి ప్రకాశమగు వెలుగును
చూచి చూపును మరిచి
కూడి కూటమి మరిచి
తానుతానేయైయున్న మహా వెలుగుసందు
నేను ఓలలాడి సుఖినైతినయ్యా
చెన్నమల్లేశ్వరుని కరుణచే
అప్పన్నప్రియ! చెన్నబసవన్నా !

8. అంతరంగ బహిరంగ శుద్ధి లేనిదే నుడివెదరు
సంతలోని వెలయాండ్రవలె !
అంతరంగ బహిరంగ మనునది
లేదు మా శివశరణులకు
అంతరంగమనునది జ్ఞాన మయ్యెను
బహిరంగ మనునది లింగ మయ్యెను
ఆ లింగమందు నుడివి, లింగమందే నడిచి
లింగమందే ముట్టి, లింగమందే వసించి
లింగమందే విని, లింగమందే చూచి
సర్వాంగము లింగమై ఆ లింగమును
చూచు దృష్టియందె ఐక్యము
గంటివా అప్పన్నప్రియ! చెన్నబసవన్నా!

# ఈ రచనకు సహాయపడిన గ్రంథములు

1. శశికళా మౌళ్గి : అనుభవమంటపద శివశరణెయరు. కర్ణాటక విశ్వవిద్యాలయ, ధారవాడ, 1976.

2. హిరెమఠ్ ఆర్.సి., డా. : (సంపాదకుడు) శివశరణెయరవచన గళు. పై విలాసము.

3. సిద్ధయ పురాణిక్, డాక్టర్ : శరణ చరితామృత. సంస్థానద వయస్కర శిక్షణ సమితి. మైసూరు.

4 తమ్మయ బండారు (పరిష్కర్త) ప్రభులింగలీల—పిడుపర్తి సోమనాథుడు. 1963.

5. తమ్మయ బండారు (పరిష్కర్త) బసవపురాణము- పాల్కురికి సోమనాథుడు. వావిళ్ల. మదరాసు.

6. శరణ సాహిత్య. కన్నడ మాసపత్రిక సంచికలు. మహిళా శివశరణులకు సంబంధించిన వ్యాసములు.

పై గ్రంథకర్తలకును, ప్రకాశకులకును నా కృతజ్ఞతా పూర్వక నమస్కృతులను మరొకసారి తెలుపుచున్నాను.

—గ్రంథకర్త.

# శివానుభవ సమితి సభ్యులు-దాతలు

దాతలు :

శివశ్రీ రేకళిగె మఠము వీరయ్యగారు రు. 1111-00

పోషకులు :

*4. శివశ్రీ యం. శివనాగయ్యగారు,
M.A., Lecturer in Geography
నందికొట్కూరు రు 50-00

5. ,, యం. శివశంకరయ్యగారు, B.D.O.
నర్సాపూర్, సంగారెడ్డి రు. 50-00

సహాయకులు :

*13. శివశ్రీ కె. చంద్రమౌళి, B.A., ఉపాధ్యాయులు
చందూలాల్ బారాదరి, హైద్రాబాదు రు. 25-00

14. ,, ఎన్. వీరభద్రయ్యగారు, B,Sc. CAIIB.
(S.B.H.) హైద్రాబాదు రు. 25-00

15, ,, పి. విఘ్నేశ్వర్‌గారు, B.Com.,
వ్యాపారము, హైదా్రబాదు రు. 25-00

సభ్యులు :

*24. ,, బి పి. ఈశ్వరయ్యగౌడుగారు అనంతపురము రు 10-00
25. ,, జి. తిప్పయ్యగారు ,, రు. 10-00
26. ,, జి. బసయ్యగారు ,, రు. 10-00
27. ,, పి. చంద్రశేఖరగౌడుగారు ,, రు. 10-00
28. ,, కె. సిద్దయ్యగారు ,, రు. 10-00
29. ,, టి వి. శివప్రకాష్‌గారు, ,, రు. 10-00
30. ,, వి. వీరయ్యగారు, M.A.,B.Ed. ,, రు. 10-00
31. ,, ఆర్. ఎమ్. వీరభద్రయ్యగారు, I.D.L. హై. రు. 10-00

* ఈ సంఖ్యలు గత ప్రచురణయందలి సంఖ్యలనుండి ముందుకు సాగినవి.

# సంక్షిప్త నిబంధనలు

## సమితి సభ్యులు

మహాపోషకులు రు. 100/- (నూరురూపాయలు మాత్రమే)
పోషకులు రు 50/- (యాభై రూపాయలు మాత్రమే)
సహాయకులు రు 25/- (ఇరువై ఐదు రూపాయలు మాత్రమే)
సభ్యులు రు. 10/- (పది రూపాయలు మాత్రమే)

1) వీరందరు సమితియందు శాశ్వత సభ్యులుగా నుందురు

2) వీరికి గ్రంథమాలయందలి పుస్తకములు 25% తగ్గింపు ధరతో V.P.P. గా పంపబడును.

3) వీరు ఆ V.P.P. తప్పక తీసుకొనవలయును.

4) V.P.P. తిరిగి వచ్చినచో ఆ మొత్తమును తర్వాత పుస్తకమువెలతో కలిపి తెలుపబడును. ఆ మొత్తమును చెల్లించినచో పుస్తకములు పంపబడును.

5) ఐదునుండి పదిమంది వరకు శాశ్వత సభ్యులు కా దలచినవారు ఒకే చిరునామాతో అందరి మొత్తమును పంపినచో వారందరి పుస్తకములను ఆ ఒకే చిరునామాకు పంపబడును. ఆ ఖర్చులను సమితి భరించుకొనును.

6) గ్రంథమాల యందలి పుస్తకములను తెప్పించుకొనువారు పుస్తకముల వెలమొత్తమును ముందుగా పంపినచో ఆ పుస్తకములు వారికి పంపబడును. ఆ ఖర్చులను సమితి భరించు కొనును

7) పుస్తకములను సమితి కార్యాలయమునుండి స్వయముగాగొనిపోవు వారికి 10% తగ్గింపు ఇవ్వబడును.

## ఇంతవరకు ప్రచురింపబడిన పుస్తకములు

| | | |
|---|---|---|
| 1. | వీరశైవధర్మము | 0-50 |
| 2 | వీరభద్రుడు-వీరశైవము | 0-10 |
| 3. | తత్త్వజ్ఞ శిఖామణి శ్రీ అక్కమహాదేవి | 1-50 |
| 4. | వీరశైవ జగద్గురు శ్రీ రేణుకాచార్యులు | 0-50 |
| 5. | శ్రీ బసవేశ్వరుని వచనములు (భావార్థ సహితము) | 0-50 |
| 6. | షట్‌స్థల చక్రవర్తి చెన్నబసవేశ్వరుని వచనములు | 0-50 |
| 7. | వీరభద్రుని వీరప్రతాపము | 0-25 |
| 8. | సిద్ధాంతశిఖామణియొక్క ప్రసిద్ధి | 0-50 |
| 9. | కొంతపల్లి వీరభద్రక్షేత్రమహాత్మ్యము-విమర్శ | 0-50 |
| 10. | ఇష్టలింగ విజ్ఞానము | 3-00 |
| 11. | వీరశైవ మహిళా శివశరణులు | 2-00 |

## అచ్చునకు సిద్ధముగానున్న పుస్తకములు

1. వీరశైవ చరిత్ర
2. ఇష్టలింగ పూజావిధి
3. అక్కమహాదేవి వచనములు
4. శివలెంకమంచెన్న వచనములు

పుస్తకములు లభించువారు :

# శివానుభవ సమితి, హైదరాబాదు

4-7-847, ఇసామియాబజారు, హైదరాబాదు-500027.